

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA**



దేశభాషలందు తెలుగు లెస్స

సంపుటము ౫౧
Vol 51

సంచికలు ౫-౬
Parts V & VI

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

స్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు:

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA**

సంవత్సరము చందా రు 3-0-0.

సంపుటము ౫౧ శుభకృత్తు–మార్గశిర సంచికలు ౫-౬

Vol 51 పుష్య, మాఘ, ఫాల్గుణములు Parts V & VI

## విషయసూచిక

# సంపాదకీయము

ఆంధ్రసాహిత్యపరిషత్తునుండి వెలువడిన సూర్యరాయాంధ్ర నిఘంటు సంపుటములలో అ మొదలు వ తుదివఱకుఁగల పదముల విషయము ముద్రితమై విక్రయమునకు సిద్ధముగ నున్నది. చివర 'శ ష స హ' అను నాలుగక్షరములకు సంబంధించిన పని యీవఱకుఁ గొఱవడియున్నది. ఆపని పూర్తిచేయుటకు ఆంధ్రసాహిత్యపరిషత్తు పూనుకొని, పని ప్రారంభించి చేయుచున్నది. ఇంతకుముందు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యమునఁ బనిచేసియున్న పండితులు

(1) శ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారు

(2) శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు

(3) శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు

(4) శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

(5) శ్రీ సామవేదం శ్రీరామమూర్తిశాస్త్రిగారు

పనిచేయుచున్నారు. నిఘంటుకార్యము కొనసాగుచున్నది. శక్యమైనంత తొందరలో నిఘంటుపని పూర్తియై సమగ్రము కాఁగలదని నివేదించుచున్నాము.

ఇట్లు,

సంపాదకుఁడు.

# నన్నెచోడుని కవిత్వము—రసపోషణము

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

శ్రీనాథుని రచన కాళిదాసరచనకు బహు సన్నిహితముగా, నాంధ్రీకరణమే మో యనునట్లనుసరించియున్నది. శ్రీనాథుఁడు పార్వతి నాశీర్వదించినట్లుగా కూడ వర్ణించినాఁడు. ఇది యాతని సొంతకల్పన. మార్గాయాసము నపనయించు వానివలె నటించి, మాయావటుఁడు పార్వతి క్షేమసమాచారప్రశ్నలడిగినట్లు రచించిన కాళిదాస శ్రీనాథుల రచన యెంతయో యుచితముగా నుండి, పాత్రపోషణము చేసిన దనుటలో నేమియు సందేహము లేదు. కాని శ్రీనాథుఁడు కాళిదాసు ననుకరించి ననుసరించినట్లుగా చోడకవి భావదాస్య మొనరింపఁ దలఁచుకొనలేదు. అందుచే స్వతంత్ర రచనచేసి, పార్వతి క్షేమసమాచార విచారవిషయమును పరిత్యజించి, యామె సౌందర్యాభినందనముతో ప్రారంభించినాఁడీ సన్నివేశమును. ఇందుచే చోడకవిరచనలో శివుఁడు విశేషకాముకుఁడుగాఁ గనుపించి, మానవప్రపంచమునకు సన్నిహితుఁడుగాఁ జేయఁబడినాఁడు. పార్వతి సౌందర్యము శివునాశ్చర్యపఱచినట్లుగా చోడకవి చిత్రించినాఁడు. పార్వతి లోకాతీత సౌందర్యమును గాంచి శివుఁడెట్లు ముగ్ధుఁడుగాకుండ నుండగలఁడు. ఈ సౌందర్యాభినందనమును కాళిదాసు వ్యంగ్యముగా భంగ్యంతరేణ ప్రకటించినాఁడిట్లు.

"చిరోజ్ఝితా లక్తకపాటలేన తే,
తులాం యదారోహతి దంతవాససా" 5-34

"యదుత్పలాక్షీ ప్రచలై ర్విలోచనై,
స్తవాక్షి సాదృశ్యమివ ప్రయుజ్యతే' 35.

అని చిగురులను, లేళ్ళను ప్రాసంగికముగా వర్ణించుచో, పార్వతిసౌందర్యమును ధ్వనింపఁ జేసినాఁడు కాళిదాసు. ఇఁక శ్రీనాథుఁడు "అంభోజపత్రి, దీర్ఘాయతాక్షి, సుందరాంగి, చంద్రవదన, పృథుశ్రోణి,

తామ్రబింబోష్ఠి" యను సంబోధనలలో నామె సౌందర్యాభినందన నిమిడ్చినాఁడు. సీసపద్యములో చోడకవి యట్టి సూచనలతోఁడను, వ్యంగ్యములతోఁడను తృప్తిచెందక వాచ్యముగా, స్పష్టముగా శివుఁడు పొందిన భావములను వివరించినాఁడు. ఇది వారివారి రచనలలోఁ గల భేదము. చోడకవిచిత్రించిన మాయావటుఁడు మొదట పార్వతీసౌందర్యాభినందనముఁ జేసినను తర్వాత నామె క్షేమసమాచారమును కాళిదాసు రచనయందు వలె విచారించినచో తాపసాచారమున కనుగుణముగానుండి, పాత్రోచితప్రవర్తన జరిగియుండెడిది. కాళిదాసు ఋషితుల్యుఁడు గాన శృంగారవర్ణనలో మేటియైనను, ఋషిధర్మమైన సత్త్వగుణప్రధానుఁడై, సాత్త్వికముగనే వర్ణించినాఁడు. శ్రీనాథుడు శృంగారరసాభిరాముఁడు,లౌకికుఁడుగాన సంబోధనలందు శృంగారమిమిడ్చినాడు ఇఁక చోడకవి రాజు, క్షత్రియుఁడును రజోగుణప్రధానుఁడుగానశృంగారాభినందనమును బహిరంగముచేయక తప్పినదికాదు. అందుచే ఋష్యాచారధర్మముల నీతఁడు జాగ్రత్తగా పాటింపనెంచక పోయెను. కాని పైకుబికి వచ్చుచున్న పార్వతీ సౌందర్యాభి నందనమును నిగ్రహించుకొనలేక, దానికే ప్రాధాన్యమిచ్చి శృంగారరస మయమును గావించినాఁడు చోడకవి తన కావ్యమును.

తర్వాత, చోడకవి చిత్రించిన మాయావటుఁడు పార్వతి నుద్దేశించి,

వ॥ ఈసుందరాంగి యెవ్వరినందనయో యనుచు సంశయాకలితహృద
యుఁడగుచున్న మునికుమారకుం జతురిక గనుంగొని, 10

తే॥ హిమనగాధీశ్వరునకు నుత్తమచరిత్ర,
మేనకకుఁ బుత్రి, గౌరి యీ మెలత పేరు
వెలయ మైనాకభూధరు చెలియ లమల
కమలదళనేత్రి వరకన్యకా లలామ 11

వ॥ అనిన నత్యాశ్చర్య హృదయుండగుచు నగజ కభిముఖుండయి, 12

చ॥ పరముకపద్దసంగమునఁ బావనమైన సురాపగాంబువుల్
శిరమునఁదాల్చి ముందటిప్రసిద్ధియు సిద్ధియుఁగన్నకంటె నీ
పరమ తపఃప్రభావమునఁ బర్వతవల్లభుఁ డిప్పుడెంతయున్
నిరుపమ కీర్తిమైఁదనరి నిర్మలుఁడయ్యె జగంబులోపలన్. 13

వ॥ అని వెండియు నిట్లనియె 14

సీ॥ స్వర్గార్థియందమే స్వర్గంబుదమ హిమ
గిరిచరులం దొక్క కెలననుండు
నర్థార్థియందమే నర్థేశుకంటెను
దన పుట్టినింటనె ధనముగలదు
పురుషార్థియందమే పురుషులు దనుఁగోరి
తపమర్థిఁజేయంగఁ దగినరూపు
మోక్షార్థియందమే ముగ్ధ దా మోక్షంబు
దలఁపంగ నేనియుఁ దలఁపఁగాదు

గీ॥ ముఖవికాసంబుమాడనీ ముదితవలనఁ
గామభోగాభిలాషయు కలిగినదియు
దీనిఁదగిలించి తగులకతాన ధైర్య
వంతుఁడైయున్న సొబగుఁ డెవ్వండొ జగతి 15

ఇందు పార్వతి హిమవంతుని కుమార్తె యని యామె చెలికత్తెలవలన వినినమీఁదట మాయావటుఁ డామెచే హిమవంతునివంశ మెక్కువ పవిత్రమైన దనియు, స్వర్గార్థములు హిమవంతునియొద్ద నుండ, తపఃకారణములవిగావనియు తెలంచుట కవకాశముగలైను. కాని కాళిదాస సంస్కృత కుమారసంభవమున నామె జనకుని గూర్చి వినకపూర్వమే హిమవంతుని ప్రభావాదులను దెలుపును. ఇందుచే పార్వతి వంశము గూర్చి మాయావటుఁడు ప్రసంగించుటకుఁదగిన యుపపత్తి కుదరదు.

అతఁ డామె కపరిచితుఁడు, నూతనాగంతుకుఁడుగదా. కాన కాళిదాసుని రచనయం దీ యనౌచిత్యదోషము గనఁబడుచున్నది. దీనిని పరిహరించుటకై చోడకవి చతురికచేత పార్వతీ సమాచారమును చెప్పించిన తర్వాతనే హిమవంతునితో సంబంధించిన విషయములను వటునిచే పలికించును. శ్రీనాథుఁడుగూడ కాళిదాసు నంధానుకరణ మొనర్చి యట్టి యనౌచిత్యముపాలే యయ్యెను. చోడకవి సంస్కృత కుమారసంభవ మందలి కాళిదాసశ్లోకభావములను ప్రత్యేకపద్యముల నాంధ్రీకరించిన చోట్లుగూడఁ గలవు. కాళిదాసు రచించిన శ్లోకమగు

శ్లో॥ వికీర్ణసప్తర్షి బలిప్రహాసిభి, స్తథా నగాంగైః సలిలైర్దివ
శ్చ్యుతైః,
యథా త్వదీయై శ్చరితై రనావిలై, ర్మహీధరః పావిత ఏవ
సాన్వయః 37

(ఈ హిమవంతుఁడు సప్తర్షులపూజలచే నవ్వుచున్నవివలె నున్నవియు నాకాశమునుండి జాఱుచున్న గంగోదకములచేఁగూడ నిర్మలమగు గుణములుగల నీచే వంశముతోఁ బవిత్రుఁడైనట్లు పవిత్రుఁడు గాలేదు) అనుదానికి, 'పరము కపర్దసంగమునఁ బావనమైన' యను పై పద్యమున నన్యూనాతిరిక్తముగ రచించినాఁడు చోడకవి. దీనినే హరవిలాసమున శ్రీనాథుఁడు,

తే॥ అభ్రవీథీ పరిచ్యుతం బైనయట్టి
యమరతటినీ జలప్రవాహమ్ముకంటె
ధరణిధరరాజ నీ చరిత్రంబు కతనఁ
బరమపావనుఁడ వయ్యె నో పద్మనయన 4-21

అని యల్పశబ్దములలో గీతపద్యమున రచింపఁ గల్గినాఁడు మనోహరముగ. కాని చోడకవి వృత్తమునఁగల 'పొందిక, గాంభీర్యము నిందు లేవు.

పార్వతీ తపఃకారణమడుగఁ గోరి మాయావటుఁడు తన చనవును సమ
ర్థించుకొనినట్లుగా కాళిదాసు రెండు శ్లోకముల నిట్లు రచించినాఁడు.

శ్లో॥ ప్రియుక్త సత్కార విశేషమాత్మనా
సమాంతరం సంప్రతిపత్తు మర్హసి
యతస్సతాం సన్నతగాత్రి సంగతం
మనీషిభిస్సాప్తపదీన ముచ్యతే. 5-39

శ్లో॥ అతోఽత్ర కించి ద్భవతీం బహుక్షమాం
ద్విజాతిభావా దుపపన్న చాపలః
అయంజనః ప్రష్టుమనా స్తపోధనే
నచేద్రహస్యం ప్రతివక్తు మర్హసి. 5-40

ఏడుమాటలాడుటచేఁ గలుగు స్నేహమువలనను, బ్రాహ్మణ చాప
లంబువలనను నడుగుచున్నాను. రహస్యముగాఁ దని తెల్పుమని యడిగి
నాఁడు. దీనినే శ్రీనాథుడు,

వ॥ సంబంధంబు సాప్తపదీనంబు గావున, నింత దవ్వ నీతోడఁ గలిసి
పలుకుచునికిఁ జేసి యే నాప్తుండఁగావున, నొక్కమాట యడిగెద,
బ్రాహ్మణజాతి స్వభావసులభంబైన చాపలంబుఁ జూచి హెచ్చు
గుందాడఁ బనిలేదు. రహస్యంబు గాకుండె నేని జెప్పుమా''4-22

అని వచనమున వ్రాసినాఁడు. రజోగుణప్రధానుఁడైన రాజగు చోడ
కవి వినయపూర్ణతో, బనికల్పించుకొనఁ దలఁపక వీనిని పూర్తిగ
త్యజించి, ప్రశ్న-యూహాపూర్వక సమాధానరూపములతో "స్వర్గార్థి
యందమే"అను సీసపద్యమున తన సందేహమును దెల్పినట్లుగా వటు
వుచేఁ బల్కించినాఁడు చోడకవి. ఆ భావమునకు కాళిదా సిట్లు
సంస్కృతమున రచించినాఁడు.

శ్లో॥ కులేప్రసూతిః ప్రథమస్య వేధస
స్త్రిలోకసౌందర్య మివోదితం వపుః

అమృగ్య మైశ్వర్యసుఖం నవం వయ
స్తపఃఫలం స్యాత్కిమతః పరంవద. 5-41

అని, తపఃకారణమును దెలుపుమని వటుఁడు ప్రశ్నించినట్లున్నది. దీనికిఁ గూడ శ్రీనాథుఁడు తు.చ. తప్పకుండ నెట్లాంధ్రీకరించినాఁడో చూడుఁడు.

సీ॥ ప్రథమ ప్రజానాథ పావనకులమునఁ
బ్రభవించి తఖలప్రపంచసార
సౌందర్యసంపద నడిసన్న దాన వ
నశ్వరం బైశ్వర్య నైపుణంబు
సౌఖ్యంబునిరవధి సర్వసామగ్రి నీ
యఱచేతిభోగ్య మత్యాయతంబు
భాగ్యంబునీకేమి బాగీతిదైనది మనో
రథమేమి చెప్పవుగూ రాజవదన !

గీ॥ దుష్కరంబైన తపమిట్లు దొడరిచేసి
మేను దయ్యించుకొనఁగ నేమిటికివచ్చెఁ
జిత్తము విచారమార్గంబుఁ జేరఁదెచ్చి
తత్త్వముఁదెలియఁజెప్పు చూతము మృగాక్షి. హర-23

ఈ పద్యరచన చోడకవి సీసపద్య రచనయంత హృద్యముగ లేదు. చోడకవి సీసపద్యము సందేహపూర్వక ప్రశ్నలు, నూహాపూర్వకసమాధానములతో నాల్గుపాదములును సమతతోఁ గూడియుండుటయేకాక, రచనావిధానము భావాభినయమున కనుగుణముగా నుండి యెక్కువ నాటకఫక్కి వలె నున్నది. (more dramatic in presentation) ఈ రీతి రచన యాకర్షణీయముగను మనోహరముగనున్నది. కాళీదాసు రచన సాధారణముగ నున్నది శ్రీనాథుఁ డతని సంధాను

కరణముచేసెను గదా. మఱియు కాళిదాసుని 'కులే ప్రసూతిః' యను శ్లోకభావమున కీ క్రింది,

శ్లో॥ దివం యదిప్రార్థయసే వృథాశ్రమః
పితుః ప్రదేశా స్తవ దేవభూమయః
అథోపయన్తారమలం సమాధినా
నరత్నమన్విష్యతి మృగ్యతే హితత్. 45

శ్లో॥ నివేదితం నిశ్వసితేన సోష్మణా
మన స్తు మే సంశయమేవ గాహతే
నదృశ్యతే ప్రార్థయితవ్య ఏవ తే
భవిష్యతి ప్రార్థితదుర్లభః కథం. 46

శ్లోకములభావమును జోడించి, పై సీసపద్యమునఁ గూర్చినాడు చోడఁకవి. కాని సంస్కృతమందు 'పుట్టినింట నవమానము లేదుగద' ఇతర తిరస్కారముండదు అను భావవ్యక్తీకరణ గల శ్లోకమునః కాళిదాసిట్లు రచించినాఁడు.

శ్లో॥ అలభ్య శోకాభిభవేయ మాకృతి
ర్విమానసా సుభ్రుకుతః పితుర్గృహే
పరాభిమర్శో న తవా స్తికః కరం
ప్రసారయేత్ పన్నగరత్న సూచతే. 43

పై శ్లోకములకు శ్రీనాథుఁ డిట్లు వచనమున నాంధ్రీకరించినాఁడు.

వ॥ పితృగేహమున నవమానంబు పుట్టదుగదా! పన్నగఫణా రత్నంబు మీఁదఁ జేయిసాఁచువాఁడు గలఁడే? నిండు జవ్వనంబునకుం దగిన విభూషణంబులు తొలంగంబెట్టి, వార్ధకోచితంబులగు వల్కలంబు లెట్టులు ధరించితివి ? దేవలోక నివాసంబున కాసపడెదేని, నది వృథా శ్రమంబు. నీ పుట్టినిల్లు దేవభూమియ కదా! తగినవరునిం గామించి సమాధి వహించితివేని నదియు నీకుం దగదు. రత్నం

బారునిచే నన్వేషింపఁబడుఁ గాని యొరు నన్వేషించునే! వేఁడి నిట్టూర్పు గాడ్పులచే దుర్లభ జనానురాగంబు నీయందు దేటపడు చున్నది. అట్టి కఠిన హృదయుం డెవ్వండొకో. వాఁ డెవ్వండేని నీవు తపంబు సేయంబూని కలమాగ్రి పింగళంబగు జటాభారంబు ధరియింప నుపేక్షించునే"

ఇదు, శ్రీనాథుఁడు కాళిదాసు ననుకరించియు వచన రూపముగా వ్రాయుటచే కథాకథన రూపమును గ్రహించినీరసింపఁ జేసినాడు. కాని చోడకవి చైతన్యయుతముగాఁ జేసి వటునిపాత్రను సాక్షాత్కరింపఁ జేసినాఁడు.మఱియు నితఁడు పుట్టినింటివిషయమును పరిహరించి పాత్రకు గాంభీర్యమును గూర్చి పోషించినాఁడు. సంస్కృతమున కాళిదాసుని చేతిలో వటుఁడు కొంచెము కపటము, లొల్లిగా గనుపించుచుండగా చోడకవి చేతిలో నతడు గంభీరుడు, నుదాత్తుఁడుగాఁ గానుపించును. అందుచేతనే తర్వాత చోళకవి, పార్వతి చెలికత్తెచే నిట్లూహింపఁ జేసి నాఁడు.

వ॥ అనిన మునికుమారు పరేంగితజ్ఞతకు మెచ్చి, వీఁడు సామాన్యపురు షుఁడుగాఁడు, నిజపరికారం బెఱిఁగింపవలయు నని చతురిక కృతక బ్రహ్మచారికి, 16

పార్వతి విషయమంతయుఁ దెలిపినది.మఱియుఁ బార్వతికిఁ బరమేశ్వరు నిపైఁగల యనురాగ బీజము మొలకనైన నెత్తలేదని నిదర్శనాలం కారముతో కాళిదాసు రచించిన,

శ్లో॥ ద్రుమేషుసఖ్యా కృతజన్మసు స్వయం
ఫలం తపస్సాక్షిషు దృష్టమేష్వపి
నచప్రరోహాభిముఖోఽపి దృశ్యతే
మనోరథోఽస్యా శ్శశిమౌలి సంశ్రయః. 5-60

శ్లో॥ నవేద్మిసపార్థిత దుర్లభః కదా
సఖీభిర స్రోత్తర మీక్షితామిమాం
తపః కృశామభ్యుపపత్స్యతే సఖీం
వృషేవ సీతాం తదవగ్రహక్షతాం 61

శ్రీనాథుఁ డీవిషయమును బూర్తిగా వదిలినను చోడకవి యిట్లనువ
దించినాఁడు.

సీ॥ ఈ నీరజాసన దానవుడురు చేసి
వలయుబీజములెల్ల మొలవఁ బెట్టి
నిచ్చలునిష్ఠతో నీరులువోయంగ
నెలమితో నన్నియుఁ గలయ మొలిచి
పెరిఁగి నానావిధ తరులతాగుల్మాదు
లేచి పయింబునఁ బూచికాచి
ఫలమొందెనేనియు మొలకయు మొలవదీ
చెలువ తపఃఫలసిద్ధి వలన

గీ॥ నింక నెన్నఁడు దయఁ బరమేశ్వరుండు
గన్ను దెఱచునో యని తనకన్న హూపు
చెలియఁ జెప్పిన విని కేలుచఱచికొనుచు
నఱిమపాలుండు పక్కలువిరుగ నగుచు. 7-19

కాళీదాసుయొక్క యుపమానముల నాంధ్రీకరింపక పోయినను,
నాతని శ్లోకార్థమును జక్కగ సీసపద్యమునఁ గూర్పఁగల్గినాఁడు చోడ
కవి. పార్వతి వృత్తాంతము నంతయు జాగ్రత్తగా పూసగుచ్చినట్లు
దెల్పిన చెలికత్తె 'ఇంగితజ్ఞయా నివేదితో' యని కాళిదాసు తెల్పఁగా
నా యింగితజ్ఞతను మాయావటువ కంటఁగట్టి వానిని తదనుగుణముగా
చోడకవి పాత్రపోషణచేసి కొంచెము మార్చినాఁడు. చెలికత్తె పార్వతి
వృత్తాంతమును దెల్పినవెంటనే మాయావటుఁ డావిషయము సత్యమా

లేక పరిహాసమునకా మె యట్లనెనా యని వటుఁడు పార్వతి నడిగినట్లు కాళిదాసిట్లు వ్రాసినాఁడు.

శ్లో॥ అగూఢసద్భావ మితీఙ్గితజ్ఞయా
నివేదితో నైష్ఠిక సుందర స్తయా
అయీదమేవం పరిహాస ఇత్యుమా
మపృచ్ఛ దవ్యంజితహర్ష లక్షణః. 62

కాని చోడకవి దీనిని విడిచివేసి, వెంటనే పార్వతిని వేళాకోళముచేయ మొదలిడెను.

శా॥ ఎట్టెట్టూ, శివుఁగళ్యానంటి నిజమా, యాతన్ని దన్‌గల్వఁగా
నట్టుల్ మెచ్చకయున్నదే తపము సేయంజొచ్చె నున్నాతఁడే
ముట్టుంబోలినవాఁడిగాఁ దలఁచిరే మోహించె దేశంబులోఁ
బుట్టుంబట్టలు మాలెనే నగజ యాభూతేశ్వరుం గల్వఁగా.
ఆ.కు. 7-20

శ్రీనాథుఁడుగూడ నక్లైవదలివేసి, వటుఁడు నవ్వులాడ మొదలుపెట్టినట్లు రచించెను.

చ॥ వికవికనవ్వి యక్కపట విప్రకుమారుఁడు మేలు, లెస్స, వా
నికినయి రాగబంధమునునిల్పెమదిం దరళాయతాక్షి మీ
నకియు, వివాహవేళఁ బురశాసను పాణిఁ బరిగ్రహించుచో
మొకమునబుస్సుమంచు నహిగ్రమ్మొగ్గినట్లు భయంబుచెందునో.
హార 10-37

సామాన్యముగా కాళీదాసు రచనను సన్నిహితముగా ననుసరించి రచించుచుండిన శ్రీనాథుఁడుగూడ పై కాళిదాస శ్లోకభావమును పరిహరించుటచేతను, శ్రీనాథ చోడకవుల పైవృత్తరచనల యెత్తుగడను బట్టియు, చోడకవి రచనను శ్రీనాథుఁడు చూచియుండెనా యను భ్రాంతిని గల్గించుచున్నది. శ్రీనాథుని మాయావటుఁ డక్లై శివుని

దోషము లెన్నుచుండెను. కాని చోడుని వటుకుమారస్వామి పార్వతి యాభిజాత్యరూపసౌందర్యాదులను స్తుతించుచు వెనువెంటశివుని దోషముల నెత్తుచు, వారి తారతమ్యములను జూపి వెక్కిరించెను. సంస్కృతమున కాళిదాసు పరిహాసపూర్వక సంభాషణ నిట్లుపక్రమించెను.

శ్లో॥ అథాహవర్ణీ విదితో మహేశ్వర
స్తదర్థినీత్వం పునరేవవర్తసే
అమంగలాభ్యాస రతం విచింత్యతం
తవానువృత్తిం నచకర్తు ముత్సహే. 5-65

శివుని శ్మశానవాసాదికము దలంచి నీవాయునను గోరుటకు నేనంగీకరింపనని మాయావటుండు పలికెను. ఈఘట్టము నంతయు చోడకవి విపులీకరించి, కాళిదాసు రచనకు మెఱుఁగు పెట్టినట్లు రచించినాఁడు. పార్వతి యాభిజాత్యమును చోడకవి వటువుచే నిట్లుస్తుతింపఁ జేసినాఁడు.

చ॥ నగనగనదిరాజ హిమవంతుఁ డుదండిరి, సురాంగనాలికిన్
మిగిలినపేర్మి మైఁదనరు మేనక దల్లి, సురూపసంపదన్
జగములలోనమేలనఁగఁజాలిన పార్వతి నీవు, భిక్షుకుం
దగిలితపంబు సేసెదఁటె? దైన్యము సేసెను దీననింతకున్. కు. 7-21

ఇందు కాళిదాసుని శ్లోకమున మొదటి రెండు పాదములను వాడుకొనినాఁడు చోడకవి.

శ్లో॥ కులేప్రసూతిః ప్రథమస్య వేధస
స్త్రిలోకసౌందర్య మివోదితం వపుః 5-41

తర్వాత చోడకవి పార్వతి సౌందర్యవిశేషము నిట్లు మెచ్చుకొనినాఁడు.

సీ॥ వారిరుహానన! నీరూపుఁ గనుగొన్న
నలకూబరుండైనఁ గలిచివచ్చుఁ
బాలఁతి! నీ భోగాపభోగముల్ చూచి జం
భారాతియైనను గోరివచ్చుఁ

గోమలి! నీ కళాకుశలతవిని శత
దళసంభవుండైనఁ దగిలివచ్చు
లలితాంగి! నీ శుభలక్షణోన్నతిచూచి
పురుషోత్తముండైన మరిగివచ్చు
సీ॥ నిన్నుఁగోరి తపంబులు నిష్ఠనోరులు
సేయఁగోరుచోఁ దపమీవుసేసె దనుట
రత్నములఁగోరి వినిజనుల్ రాక జనుల
రత్నములుగోరి పైఁబడి రాకఁబోలు. 7-22

పై సీసపద్య మందలి నాలుగు పాదములందలి భావములు కాళిదాస సంస్కృత కుమారసంభవమున లేవు. కాని యెత్తుగీతి యందలి చివరి రెండు పాదములలోఁగల నుపమానము మాత్రము కాళిదాసు ప్రథమ ముననే పార్వతితో సంభాషించినపుడు వాడిన 'నరత్న మన్విష్యతి మృగ్యతే హితత్' (5-45) యను దానిని గ్రహించినాఁడు. ఇట్లు చోడకవి తన రచనలో కాళిదాసు రచించిన శ్లోక భాగములను కొంచెము వెనుక ముందుగా స్థలములనుమార్చి యుపయోగించుకొని నాఁడు. పై సీసపద్యపాదములు తిక్కన విరాటపర్వ కీచక కథాఘట్ట మున నెట్లనుకరణరూపమున సాయపడినదో యీక్రిందిపద్యమువలనఁ దెలియును.

సీ॥ ఇయ్యింతిప్రాపున నెయ్యసంగుఁడు పార్వ
తీశునైనను దక్క నేలకున్నె ?
యిన్నాతి చెలువంబుగన్న శచీప్రియుఁ
డైనను గనుకలి నవయకున్నె ?
యిత్తన్వి కనలేమి కెదిరిపన్నిదము భా
షా విభుతోనైనఁ జఱవరాదె?
యిత్తలోదరి జీవితేశున కిందిరా
పతినైన మెచ్చక పలుకఁజనదె విరాట. 11-27

సందర్భోచితముగ తిక్కన పై పద్యమున చోడకవి సీసమునను కరించి తన కవితాశిల్పము నభివృద్ధి జేసికొనినాఁడు. దానికొరవడి కొంతవఱకు చోడకవి రచనయైనదని చెప్పవలయును. తర్వాత నామాయావటుఁడు పార్వతి శివుని వరించినందులకు జాలిపడినట్లు చోడకవియిట్లువర్ణించెను.

చ॥ జనులం విరుద్ధ వేషియగు శంకరు నేలొకో?యిందుఁడొందెఁ బా
వనతరుఁడంచుఁ జిత్తములవందఁగ, దానిపయిం ద్రిలోకశో
భనవగునీవు నాతపసిపాల్పడి మిక్కిలివంతచేసెదో
యని యనిశంబుఁదద్దయుభయంపడుచున్నది లోకమెంతయున్.
7-23

ఈ భావముగూడ కాళిదాసునుండి గ్రహింపఁబడినది. సంస్కృతమున

శ్లో॥ ద్వయంగతం సంప్రతి శోచనీయతాం
సమాగమ ప్రార్థనయా పినాకినః
కలాచసా కాంతిమతీ కలావత
స్త్వమస్య లోకస్యచ నేత్రకౌముదీ. 5_71

(తాత్పర్యము:— ఈశ్వరునిఁ జేరుటచే నిప్పుడు రెండు వస్తువుల విషయమై విచారింపవలసి వచ్చినది. ఇదివఱకే ఈయన నాశ్రయించిన చంద్రికళ యొకదానికి నిప్పుడు రెండవదగు, ప్రపంచానంద కౌముది వైన నీకును)

కాళిదాస కుమారసంభవమున లేకపోయినను కాళిదాసేరచించిన యభిజ్ఞానశాకుంతల నాటక నాందీశ్లోకమున వర్ణింపఁబడిన శివుని యష్టతనువుల వర్ణనమునకు విపరీత వ్యాఖ్యానమునుజేసి దాని నీసందర్భమున నుపయోగించుకొని మాయావటునిచే పార్వతికిఁ జెప్పించినాఁడిట్లు చోడకవి.

సీ॥ పుడమివైనెకదలక పడియుండు నెల్లచో
నెఱిలేక నీరయి నెఱసియుండు
నవలుఁడై డాసినఁ గొనికాలుచుండు వా
తూలుఁడై కనుకనిఁ దూలుచుండు
నాకాశమై చూడలేకుండుఁ బ్రాలేయ
ధాముఁడై పెరుగుచుఁ దఱుగుచుండు
భానుఁడై మిన్నులపైఁ బాఱుచుండుమ
హాత్ముఁడయ్యును బొడవడఁగి యుండు

గీ॥ నిన్ని రూపులందు నేరూపు నిజముగా
నెఱుఁగవచ్చు వీనికెల్ల నొకట
రూపుసేయ నెవ్వరోపు మఱట్టి మా
యావి నీకుఁ దగులనగునె బేల. 7-24

ఈ విధముగా చమత్కారముగ శివు నష్టతనువులను గూర్చి విపరీత వ్యాఖ్యానముచేసి పార్వతితో వాదింపఁ జేయుటకు చోళకవి చూపిన ప్రతిభా విశేషము నైషధమున శ్రీహర్ష మహాకవి యష్ట దిక్పాలకులు బలవంతముగా దమయంతిని గైకొనిన నేమి చేయుదువని దేవదూత యగు నలునిచే దమయంతితో పల్కించిన చమత్కృతి పాఠకులకు స్మరణకు రాకయుండదు. ఇందలి రచనయు కైశికీ వృత్తిలో చక్కని తేఁట తెలుఁగు మాటలతోఁ జేయఁబడినది. రచనయు నిరలంకారముగ నున్నది. కాళిదాస శ్లోకమిది.

శ్లో॥ యాసృష్టి స్స్రష్టురాద్యా, వహతి విధిహుతం యాహవిర్యాచ హోత్రీ
యే ద్వేకాలం విధత్తః, శ్రుతివిషయ గుణా, యాస్థితా వ్యాప్య విశ్వం

యామాహు స్సర్వభూత ప్రకృతిరితి, యయా ప్రాణినః
ప్రాణవంతః
ప్రత్యక్షాభిః ప్రపన్న స్తనుభి రవతు వస్తాభి రష్టాభిరీశః.

తర్వాత చోళకవి మాయావటునిచే శివునికంటె సకల సౌంద ర్యైశ్వర్య వంతులగు బ్రహ్మ విష్ణు దేవేంద్రులను జేకొని వారల గ్రహింపక శివుని ప్రేమించితివే యని పార్వతి నాక్షేపింపఁ జేయును ఈ భావములు గూడ సంస్కృత కుమారసంభవమున లేవు.

చ॥ సకలకళాధరుండు జలజప్రభవుండు విరించియుండఁ, బా
యక సిరిఁ దక్కనేలిన మురాంతకుఁడుండ, సమస్త దేవతా
ప్రకరముగొల్వనున్న సురపాలకుఁడుండఁగ, నిట్టిమూర్ఖ భి
క్షుకు నపదార్థుఁ బెడఁగతఁగల్చితి శంకరుఁ బంకజాననా! 7 25

ఈ వాదము సహేతుకముగ నుండి ప్రసాదగుణములోఁ గూర్పఁబడి, రసవంతముగా రచింపఁబడిన దీ పద్యము. ఈ సన్నివేశమంతయు నిక్కై నిరలంకారముగను, ప్రసాదమాధుర్యాదిగుణములతో నొప్పి, దేశీయ పదములతో రచింపఁబడినది. మాయావటుఁడు చేసిన యాక్షేపణము లను ప్రత్యాఖ్యానము చేయుచు తన శివభక్తిని, శివ మాహాత్మ్య ప్రభావములను ప్రకటింపఁదలఁచి పార్వతి యావటువుతో నిట్లుసమా ధాన మొసఁగినది. ఇదిగూడ సంస్కృతమున లేదు.

వ॥ అని యనేక ప్రకారంబులం బరమేశ్వరు నిరాకరించుచు నితరసుర
వరుల విశేషించుచున్న కృతక విప్రు నగజ కటాక్షించుచు, 26

సీ॥ బ్రహ్మాండనికరంబు పరమేశుజలమూర్తి
నుదయించు నల్పబుద్బుదము లనఁగ
భాసుర స్థూలరూపమునందుఁ బరమాణు
సమితి నారోమకూపముల నుండుఁ
గాలాగ్నితను మహాజ్వాలాభిహతిఁ దూలి

గలగొను విస్ఫులింగము లనంగ
నట్టిబ్రహ్మాండంబులం దొక్క బ్రహ్మాండ
కుహరైకవాసులై కుత్సితాత్మ
తే॥ లనఁగ వర్తించు హరి కమలాసనా సు
రేశ్వరాదులఁ దెచ్చి సర్వేశుతోడ
నెన్ని సాటులపెట్టఁగా నెన్న దీవు
జడుఁడవై తెల్లు బ్రాహ్మణజాతిఁ బుట్టి. 27

ఉ॥ గంధగజాసురారిఁ బురకాయజకాల బలప్రహారి, సు
గాంధకహారిఁ, దీవ్రకరశాయతవహ్నివిహారి, దేవతా
సింధు జలౌఘధారి, సురసిద్ధమునీంద్ర గణోపకారి, న
ద్బంధవిహారి మూర్ఖుఁడన బ్రాహ్మణ నీవధికారివే మహిన్. 28

చ॥ హరుఁ జెడనాడి ముందఱుకృతాంతకు కన్నదియేమి, నీలకం
ధరునఱ కెగ్గులాడి మఱిదక్షునికన్నదియేమి, విశ్వసం
హరుపయి నెత్తిపోయి విషమాయుధు కన్నదియేమి పూర్వభీ
కరగతి సూచిచూచి పురఘస్మరుఁ బల్కుట నీకు బుద్ధిమే. 29

వ॥ అదియునుఁ గాక,

చ॥ నిటలతట ప్రచండతర నేత్ర సముత్థిత తీవ్ర పావకో
త్కటశిఖలం బురాంగభవకాలహరంబగు టేమి పెద్ద, ఘూ
ర్జటినెపమల్గిచూచిన నజప్రకరాండ సహస్రకోటులో
క్కటఁగమరుఁ మహానలముగప్పునఁ దూలకణంబుపోలెనై. 31

వ. నీ వెంతవాఁడ వఖిల భువన భవనాధీశ్వరుఁ డైన పరమేశ్వరు
దూషింప, ననుచున్న గిరిజ పలుకులు విని కృతక మునికుమారుం
డపహసించుచు, 32

మొదటి సీసపద్యమున సకల భువనములకు నధినాథుఁ డైన పరమేశ్వ
రుఁడు, బ్రహ్మాండములో నొక్కొక్క భాగముల కధికారులైన బ్రహ్మ

విష్ణు, దేవేంద్రాదులు పోల్పఁదగరని యాతని పూర్వ వాదమును
ప్రత్యాఖ్యానము చేసినది. మఱియుఁ బరమేశ్వరుఁడు మూర్ఖుఁడనివటుఁడు
దూషించినందుల కాతని జడుఁడని నిందించినది. రెండు మూఁడువృత్త
పద్యములు చక్కని యంత్యప్రాసములతో వ్రాయఁబడి పోతన రచ
నను స్మరింపఁజేయుచున్నవి. శివుని ప్రభావమాహాత్మ్యములు మొదటి
వృత్తమున బాగుగ వర్ణితమైనవి. మఱియు శివుని మూర్ఖుఁడనుటకుఁ దన
కేమి యధికార మున్నదని ప్రశ్నించినది. సకల శాస్త్రజ్ఞాన ప్రమాణ
విదుఁడైన సంస్కారి యధికారియనఁబడును. అట్టియధికారి యీవటుఁడు
గాఁడనియు, దాన నతనికి శివుని నిందించుటకధికారము లేదని తూల
నాడినది పార్వతి. తర్వాతవృత్తమున శివునిఁ దూలనాడిన యమ,దక్ష,
మన్మథాదులగతి యేమైనదో జ్ఞాపకముచేసి, యా గతియే నీకుఁగూడఁ
బట్టునని సూచించి, యట్లు దూషించుట బుద్ధిగల పనియేనా యని
యాతని నడిగినది. అంతియకాక, శివదూషణ చేసినందులకు, ఇష్టజన
తిరస్కార వాక్యజనిత కోపావేశయై పార్వతి శివుని ప్రతాప పరాక్ర
మములను ప్రకటించునట్లు రోషావేశముతో చివరి వృత్తము నారభటీ
వృత్తిలో దీర్ఘసంస్కృతసమాస జటిలముగ చోళకవి రచించి రసపోష
ణము చేసినాఁడు. ఈ విధముగా చోడకవి చేతిలో పార్వతి విదుషీమణి
గాను, ప్రౌఢగాను, ధైర్య పౌరుషాభిమానములు గలదిగను, వీరశైవ
భక్తురాలుగను, గనుపించుచున్నదిగాని, కాళిదాసుని కుమారసంభవ
మందువలె, సాధ్వి, ముగ్ధ, యబలవలె చిత్రింపఁబడలేదు. శివభక్తుఁడు
రజోగుణప్రధానుఁడైన క్షత్రియునిచేతిలో పాత్రపోషణ యటుజరుగుట
యుచితమేగద. అథవా, కాళిదాసు కూడ శకుంతలను దుష్యంత రాజ
సభయం దిట్లే సంభాషింపఁజేసెనుగదా. తన తండ్రియగు దక్షుఁడే తన
భర్తను దూషింపఁగ సహింపని సతి యపరావతార మైన పార్వతి
పరులు దన ప్రియుని నిందించిన యూరకొనునా ? ఇక్కడ శృంగార
ములో వీరము మిళితమైనది.

పార్వతి ప్రతివచనములకు మాయావటుఁడు కూడఁ గొంచెము జంకిజాఱి, మెత్తపడిపోయినాఁడు. 'పురఘస్మరుఁబల్కుట నీకుబుద్ధియే' యని పల్కినపార్వతిం 'దగదని బుద్ధిసెప్పఁడిదిదప్పె' యని మెత్తగా జాఱిపో మొదలిడినాఁడు వటుఁడు. మొదట పార్వతితో శివునిఁగూర్చి వేళాకోళము, వెకచకాలు చేసి పరిహాసించిన మాయావటుఁ డిప్పుడు పార్వతికి హితోపదేశము చేయువాని వలెఁ గొంచెము మృదువుగా మాట్లాడ మొదలిడినాఁడు, కాని శివునిగూర్చి నిర్లక్ష్యభావము మాత్ర మతనికిపోలేదు. అష్టదిక్పాలురతో శివునిఁ బోల్చి వారికంటె నెందును ఘనుఁడు గాఁడు శివుఁడని వాదించినాఁడు. స్త్రీలకై పురుషు లనేక కష్ట ములపాలగుట సహజము కాని యట్టి శివునికై తపముచేయుట నిరర్థక మని హేతువాదన మారంభించినాడు వటుఁడీక. ఈ రచన యంతయు చోడకవి స్వకపోల జనితమైనదై తేటతెలుఁగున నటు సాగినది

చ. తగరమువాఁడిచేసి వెడతాపసి నాకడ బీరుగాఁడుఁగాఁ
బొగడెదు, నీవు మాకలుగఁబోయెదు, లోకమువారు భిక్షుకున్
నగసుత గల్చిపోయెనని నవ్వరు, రాతఁడు నీకుఁ గల్యగాఁ
దగఁడని బుద్ధిసెప్పఁడిదిదప్పె, వరానననీకుఁ జూడఁగాన్. 7-33

ఉ॥ నేరకకల్చి భిక్షుకుని నీవొక పెద్దగఁ జేసెదింత జం
భారిమె భోగసంపదఁ, గృతాంతకుఁడే పటు విక్రమంబునన్
వారిధివల్లభుండె విభవంబున, నా ధనదుండె భూతివి
త్రోరుసమృద్ధి నీచెనఁటి యూఁపర లేటికి నాడె దెన్నియున్. 34

సీ॥ మగ లాఁడువారికిమరగి ముచ్చిలి, బంది
పట్టి, కన్నంబులుపెట్టి, తెరువు
దెక్కొని, చని పరదేశంబు, లుడుగక
దిరిమ్మరి, వేశ్యలను తొమ్మఁ బోయి,

యాచకులై వేఁడి, నీచుల సేవించి
కలమెక్కఁజని, నలిఁగయ్యమాడి
యేమంగునకుఁ బాడి, యిల్లైన్ని యేనియుఁ
గష్టముల్ పడిరని గలదు గాక
గీ॥ మగలఁగోరి తొల్లి మగువలు తపములు
సేసినవసిరనివ చెట్టలెందుఁ
గలవె, దీనికచ్చునిలిపితి నీవ నీ
వలన నతులపురులు వ్రాలిసెఁగాక. 36

కం॥ వసుధా ధరేంద్రసుత! నీ
వసదృశముగ శివునిఁగూడి యాడుటయాడుం
బసిపని "సమానశీల
వ్యసనేషు సుసఖ్య" మనిన వచనము వినవే. 37

చివరకు శివుని శరీర వైపరీత్యములను ప్రత్యేకముగ సంస్కృతమున కాళిదాసు రచించిన వివిధ శ్లోకముల భావము నొక్క సీసపద్యమున జోడించి విశేషములతోఁ గూర్చి పార్వతికి శివునిపై రోఁతను గల్గించుట కెట్లు ప్రయత్నించెనాఁడా మాయావటుఁడు చోడకవి చేతిలో.

సీ॥ ఎమ్ములుదొడుగను నింతయు కాదందుఁ
బెను బాము లెడనెడఁ బెనఁగియుండు
వాదేమి మెయిపూఁత బూదియున్నింతేయు
గాదదిరొయిలుకుల బూది నెఱియు
నశనంబు భిక్షాన్నమనుటయు కాదందుఁ
గూడఁ బోసిన పులికూడు మఱియు
నేకాకియైనుండు నింతియు కాదు ప్రే
తావాసములనుండు ననుదినంబు

తే॥ చూడవిరసమై నగ్నంబుతోడ నుండు
నదియుఁగా కిరుసంజలనాడు మరులు
గొఱగఁగలుచుఁగా కాలనిఁగోరి తపము
సేసెదఁటగౌరి, నీవెంత చేట్లపురలా. 38

కం॥ తోడవులు చివికిన యెమ్ములు
గుడిముట్టు గపాలమిల్లు గుడిముదియెద్దే
కుక్కడు, గట్టువలువుదోలగు
బడరునకై నవయ నేమి ప్రియమువచ్చెన్. 39

సంస్కృతమునఁ గాళిదాసు, నగలు తీసివేసిన పార్వతి యవయవము లందలి గుర్తులు మొదలైనవానిని వర్ణింపఁగ చోడకవి దానిని పరిహరించి పార్వతి శరీరసౌష్ఠవమును దపముచేఁ గృశింపఁజేయుట వలనఁ బ్రయోజన మేమని యిట్లుపదేశించును.

చ॥ ఎలఁబోఱవోని మేను నవయించియు, రాగరసంబు నిండుఁగుం
డలోయనుపీఁగుఁ జన్నులబెడంగడలించియు, మారుపువ్వుఁదూ
పుల సగులోల దృగ్విచలపోహాము పుచ్చియు, భోగవృద్ధి ని
ష్ఫలముగఁజేసియుందుదిఁ దపంబున నయ్యెడిదేమి చెప్పుమా.
7-41

వ॥ అని యనేక ప్రకారంబుల భేదించుచున్న తన్నుఁ దృణీకరించి యదత్త ప్రతివచనయై యున్న గౌరి నాక్షేపించుచు, 42

కం॥ పులిగూడు దిండి వొఱగం
గలిచియునో చెల్లయింత గల్పించెదు (శ్రీ)
గలవానిఁ దగిన పురుషుం
గలిచిన నీకన్నుబాము రొగయు డవుదనుమా. 43

వ॥ అనివావాయోడక నెఱనుముట్టం బలికి పెక్కుదెఱంగుల నీసుదూపించుచుఁ దన్ను వికారదృష్టిం గనుగొని సాభిలాషోక్తులం బ్రకటించు

చున్న కృతక విప్రు నగజ కటాక్షించి, 44

పై విధముగ మాయావటుఁడు మితిమీఱి పార్వతితో భాషించినాఁడు. హద్దుమీఱిపోయిన యాతనివాదన వట్టి మోటువానిదనముఁజూపినది. సంస్కృతమునఁ గాళిదాసు రచన చమత్కారముతోఁ గూడియున్నదే కాని, మోటుదనమువలకుఁబోలేదు. అందుచేఁబార్వతిచెలికత్తెలుగూడ జోక్యము గల్పించుకొని మాయావటువు నాక్షేపించి యాతనికిఁ దగినటు మోటుగనే ప్రవర్తించి వారలకు పార్వతీపరమేశ్వరులపైఁ గల గౌరవాభిమానములను, వారు శివశక్తు లని ప్రకటించి తెలిపిరి.

కం॥ తెలుసంటి దన్ను నెదిరిని
నెఱుఁగఁడు దనకోలఁదివేడ్క లెఱుఁగఁడు మొండీ
డలజాతి మ్రుక్కు మన్నం
గొలఁడెక్కడనిట్టి ప్రేలుగొండ్లుం గలరే. 7-49

అని యావటుని దూషించిరా చెలికత్తెలు. ప్రేలు గొండఁడు, మొండియఁట, పరేంగిత జ్ఞాన శూన్యుఁడఁట యా మాయా వటుఁడు. ఇందుచే వారి సంభాషణ కొంత రసాభాసముగా ముదిరిపోయిన దనియే చెప్పవలయును. తర్వాతఁ బార్వతి తపః ప్రయోజనమును దెల్పి చెలులుశివశక్తిసంబంధము నిట్లు చాటిరి.

శా॥ ఏ యజ్ఞానత నీశువిశ్వజనకున్ నిందించెదీ విప్రహా
మాయన్ జండిక నాదిమూర్తిఁ ద్రిజగన్మాతన్ మదాంధుండవై
డాయంజూచెదు పాపకర్మ! నినుఁ జూడంగూడు నే కేవల
స్త్రీయే పార్వతి సన్యభామతిగఁ దాఁ జింతింప నీపాప్తితే. 52

సీ॥ జ్ఞానస్వరూపమై సర్వాత్ముఁడున్నఁ దా
జ్ఞేయ స్వరూపమై నెఱసియుండుఁ
బురుషస్వరూపమై పరమేశుఁడున్నఁ దాఁ
బ్రకృతి స్వరూపమై పరగుచుండు

సూక్ష్మస్వరూపమై శుద్ధాత్ముఁడున్నఁ దాఁ
స్థూలస్వరూపమై తోఁచియుండు
నర్థస్వరూపమై యనలాత్ముఁడున్నఁ దాఁ
శబ్దస్వరూపమై జరుగుచుండు
ఆ॥ హరుఁడు రుద్రరూపమై యున్నఁ దా నుమా
మూర్తి దాల్చి లోకములకు హితము
సేయుచుండుఁ గాన శివశక్తి భేదంబు
తెలుఁగు నీకుఁ జనున కేలఁగలావె. 53

పై పద్యముల ఛాయలు సంస్కృతమున లేవు. అవి నన్నెచోడుని స్వతంత్ర రచనయే. ఈ సన్నివేశము శివశక్తుల యైక్యమును ప్రకటించుటతో సమాప్తమగుచున్నది. తర్వాతఁ బార్వతి శివ దూషణము చేయుచున్న మాయావటుని పల్కులను విననిష్టములేక పోఁబోవును. అట్టితఱి శివుఁడు ప్రత్యక్షమగును. సంస్కృత కుమారసంభవమునఁ గూడ నిట్లే యీ సన్నివేశము సమాప్తమైనది.

వ॥ అనుచున్న సఖులఁ గని గిరిజ మదినాక్షేపించుచు, 7-54
చ॥ జలజభవాచ్యుతాది సురసంఘములెల్లను భక్తియుక్తులై
కొలుచుమహేశు నీచపలకుత్సితవిప్రుఁడువచ్చి నోరఁగ్రొ
వ్వులుపలుకంగ మీరును జెవుల్ సొరవించుసహించి మాఱుమా
టలు నోడికట్టిపల్కెద రోడంబడినట్టులు బ్రహ్మబంధుతోన్. 55
వ॥ హీనిం బలికి పరమేశ్వరుం బలికించి వినుటేమిపని యని కోపావేశంబునఁ బరాఙ్ముఖియై చననున్న, కన్నెతింగి వరదుండు గౌరి నిశ్చల భక్తి యుక్తికి ననురక్తుఁడై యాక్షణంబ ప్రత్యక్షుండై నిజస్వరూపంబు చూపిన, 56

ప్రధానముగా రసపోషణము గల్గిన యీ సన్నివేశము నిరలంకారముగఁ దీర్పఁబడుట యిందలి ముఖ్యవిశేషము. ఈవిధముగా శ్రీనాథ

చోడకవులు దమ నైజ కవితా శైలులతోఁ దమ వ్యక్తిత్వములను బ్రదర్శించుచు రచించిరి. కాళిదాసురచనలో శివుఁ డొక దీర్ఘోపన్యాసమును జేయఁగఁ జెలికత్తెగూడ నట్లే చేయును. పిదప శివుని వరించినందులకు మాయావటుఁడు పార్వతిని వేళాకోళము సేయుచుఁ బెద్దయుపన్యాసమును మరలఁ జేయును. దానిని బ్రత్యాఖ్యానముచేసి పార్వతి మఱియొక యుపన్యాసమిచ్చి యచటనుండి తొలఁగిపో జూడఁగా శివుఁడు ప్రత్యక్ష మగును. శ్రీనాథుఁడు కాళిదాసునే యనుకరించి క్లుప్తీకరించెను గాన పార్వతి ప్రత్యాఖ్యా నోపన్యాసమును విడిచివేసెను. ఇఁక నన్నెచోడకవి పాత్రలచేత దీర్ఘోపన్యాసములను జేయింపక చిన్నచిన్న సంభాషణలనుజరిపించి, పార్వతీపరమేశ్వరులతోఁపాటు చతురికయను పార్వతి చెలికత్తెనుగూడ నొక ముఖ్యపాత్రగాఁ జేసి, చతురిక చెలుపు నొక్కొక్క విషయమును మాయావటుఁడు పరిహాసము చేయుటయు దానికామెగాని,పార్వతిగాని ప్రత్యాఖ్యానము సేయుటయుఁగ్రమమున జరిపి, యొక చిన్న నాటక సంభాషణమువలెఁ గూర్చినాఁడు. ఇది శ్రీనాథ చోడకవి కాళిదాసుల రచనలందలి భేదము. చోడకవి రచన విస్తరింపఁబడఁగ సందర్భోచితముగ నూత్న భావములును, శివభక్తియు నందు బ్రతిపాదింపఁబడినవి. మఱియుఁ గుమారసంభవద్వయమందు తారకాసురుని బాధలను దేవతలు బ్రహ్మతోఁ జెప్పుకొను వృత్తాంతమును, పార్వతి జన్మ వృత్తాంతమును, నామె దన తండ్రిచే శివుని కుపచారము చేయ నియమింపఁబడిన తర్వాతనే తెలుపఁబడినవి. కాని శ్రీనాథుఁడు హరవిలాసమున తారకుని కథను మొట్టమొదటనే రచించి,తర్వాతఁ బార్వతీ పరమేశ్వరుల కథకు మధ్య నడ్డులేకుండఁ జేసినాఁడు.ఇది యీ రెంటిలోఁగల భేదము. శ్రీనాథుడు సంస్కృత కుమారసంభవమునఁ గాళిదాసు రచించె నను ప్రశస్తిగల యెనిమిదాశ్వాసముల కథ మాత్రమె కొంచెము విపుల

ముగ సుమారు 200 పద్యములలో రెం డాశ్వాసములందు రచించి నాఁడు. శివ పార్వతుల వివాహానంతర కథ నొక వచనములో బహు క్లుప్తముగాఁ బదిపంక్తులలోఁ దేల్చివేయఁబడినది. అందీ సన్నివేశమును కాళిదాసు ఏఁబదియైదు శ్లోకములలో వ్రాయఁగ, శ్రీనాథుడు పదు నెనిమిది పద్యములలోను, చోడకవి యేబదిమూఁడు పద్యములలోను రచించిరి. శ్రీనాథు డీ రెం డాశ్వాసములందుఁ గాళిదాస కుమార సంభవకథను బహు స్వతంత్రముగను, బహుక్లుప్తముగను వర్ణించినను రసవంతములైన సన్నివేశములలోఁ జమత్కారముగ రచించి తన ప్రతి భను ప్రదర్శించియే యున్నాఁడు. నన్నెచోడుఁడా కథనే ప్రపంచించి, వర్ణనలను విస్తారముగ పెంచి, కొన్ని సన్నివేశములను గల్పించి పెద్ద కావ్యముగ రచింపవలసి వచ్చినపుడు తన ప్రతిభను, స్వాతంత్ర్యమును ప్రకటించి కాళిదాసునకుఁగూడ మెఱుఁగులు పెట్టి, శ్రీనాథ కవిసార్వ భౌమునిఁగూడ మించినాఁడనుటలో వింత యుండదు. అది పాత్రపోష ణమున రసావిష్కరణము మొదలైనవానిలోఁ బ్రకటితమైనట్లు పైనిఁ గాంచితిమి.

సంభోగ శృంగారము :

ప్రస్తుతకాలమున సంభోగ శృంగారమును వర్ణించుట నవనాగ రకుల కసభ్యముగాఁ దోఁపవచ్చును. కాని వారుగూడ నెవరికి వారు దమలోఁ జదువుకొని యానందించుటలో వెనుదీయరు కదా. సభలో బహిరంగముగాఁ జదివి వినిపించుటకు సభ్యముగా నుండకపోవచ్చును. నాయికానాయకులు పరస్పరావలోకనమున బాహ్య సౌందర్య రూప లావణ్యాదుల వలన నాకర్షింపఁబడి యనురాగ మొందిన తర్వాత, వెంటనే కారణాంతరముచే సంయోగము సిద్ధింపక కాలయాపనము జరు గుటచే, వారి పరస్పరానురాగము దృఢమై, గాఢమై, నిశ్చలమై పర స్పర సమాగమమున కువ్విళ్ళూరుచు మనస్సులోఁ బాలుతాగుచుఁ

గొంత బాధపడిన తర్వాత, వారి సమావేశము సక్రమముగా సిద్ధించి నపుడు, నాయికానాయకులు సన్నిహితముగానున్నపుడు వారి పూర్వ భావానురూపముగఁ బరస్పరము సంతృప్తితో మెలఁగురీతిని వర్ణించుట కూడ నొకకళానైపుణ్యమే. నాయకుఁడు నాయిక ననునయాలాపాదులచే వశ్యము చేసికొని, యామెకు సహజమగు లజ్జను క్రమముగాఁ బాపి, యానందపెట్టి తానానందమునొందుట కళారహస్యము కదా• ఈ శిల్పమున చోడకవి యెట్లు తన చాతుర్యమును బ్రకటించెనో చూతము పార్వతీ పరమేశ్వరుల పట్ల.

చ॥ నయమున భీతివాపి, మది నన్నునఁ దేకువసూపి, మాటలం
బ్రియమొనరించి, పొంతనల బేటము పెంచుచు, సమ్మదంబునం
బయిపడి, గుహ్యముల్ బయలుపర్చుచుఁ, జెయ్వుల లజ్జ
వాపుచున్
మెయివడిగౌరి నీశ్వరుఁడు మేకొలిపెన్ రతికిం గ్రమంబునన్.
9-146

సీ॥ నిడువాలుచూడ్కులు నిగుడించు మగుడించుఁ
బతికన్నుఁగవ పొలపంబు తెలిపిఁ
బొరిబొరిమైఁడీఁగ పొందించు నెడలించుఁ
జోఁకైన ప్రియుమేను సుడియునెడల
వెడఁదొక్కుఁ బలుకులవినుపించుఁ గొదలించుఁ
గవియువల్లభు పల్కుపలుకు పొంతఁ
దరహాసరుచి మోవిదలకించుఁ దలికించుఁ
విభు పరిహాసోక్తి వెలువుఁగలవ
గీ॥ సెరవుసేయ కథిపు చెయ్వులమెయినడి
నడరుఁ దానిగాని యదియుపోలెఁ
దరుణిసెమ్మనమునఁ దమకంబు లజ్జయు
నలఁతి కగ్గలింప నాఁకగొనక. 9-147

క॥ తరతరమంజక దఱికఁగఁ
బరువడి మృదుతరరతములఁ బరిణతులై యా
హర గిరితనయులు సురతా
తురులగుచుం గాయువ్విగిలి తోడ్తోనమరెన్. 1·8

సీ॥ కరలత లందంద కామపాశంబుల
నదిమి సంధించుచున్నట్లు బిగియ
నొదవఁ జేర్చిందులఁ బదనైనపూఁతలం
గంబునకు వజ్రలేపములు గాఁగఁ
బులకలొండొరులమేనుల నుచ్చిపోయిడ
గ్గరమొలలిచ్చిన కరణి గాఁగఁ
గనకంపుఁబ్రతిమల గాఁచి యంటించిన
ట్లొడ-గూడి తనువులొండొంటిఁ గదియఁ
గీ॥ దగఁగ నొక్కతలకు మొగములు రెండైన
పగిదిఁదలలు మాఱు మొగము వడఁగ
గీఱి మేనుమేనఁదూఱి గాఢాలింగ
నంబు సేసి రంగనయుఁ బ్రియుండు. 9-149

ఇందు పార్వతీ పరమేశ్వరుల పరేంగితజ్ఞానముతోఁ గూడిన హావ భావ విలాస చేష్టలు పరస్పరానురాగమును వ్యక్తపఱచుచు తేటతెలుఁగు మాటలతో హృదయ రంజకముగ వర్ణింపఁబడినవి. ఇందలి భావములును రచనాపద్ధతియు కవి హస్తమున నూతన మార్గము నవలంబించినవి. "ఒక్క తలకు మొగములు రెండైన పగిది, తలలు మాఱు మొగము వడఁగ" అను రచనలోఁ గల ప్రౌఢిమయు, చమత్కారమును బూర్వకవి రచనలందుఁ గానఁబడవు. జగమున కంతకు మాతాపితలగు పార్వతీపరమేశ్వరులను తుదరి కాముకవ్యాపారరీతి వర్ణింపఁదగునా యనినచో, దేవులైనను, పశువులైనను, మానవులఁ గోఱకు

వ్రాయఁబడిన కావ్యమున మానవభావములే వారి కారోపింపఁబడును కదా. అందుచేతనే రామాయణమున సీతాపహరణమునకై రాముల వారు సామాన్యమానవునివలె విలపించుట వర్ణింపఁబడినది. నన్నెచోడుఁడు గూడ కుమారసంభవ ప్రథమాశ్వాసమున నేనుఁగుల కాముక క్రీడ యిట్లు వర్ణింపఁ బడినది.

వ॥ ఇట్లనేక ప్రకారంబుల శృంగారంబుసేసి కామకేళీ లాలసులై కరి కరేణువు లత్యంతానురక్తి నొండొంటి నడరం దొడంగె. నంత నందు,

శా॥ చేటంచేటముగా నిభంబు కరణిన్ బ్రేమంబుతోఁజేరి లా
లాటంబొత్తు, లలాటపట్టమునఁ గేలంగేలు వేష్టించుఁ, గ్రీ
గోటన్ మే రొయరయున్, పరాంగములు సోఁకున్,
బుష్కరాగ్రంబునన్
దాటోటంబొనరించుఁ, గూడఁబ్రియఁ గామాసక్తినాసక్తమై. 1-100

మ॥ హృదయాహ్లాదముతోడఁ బాయకసదా నేకప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగుచున్న విలసన్మత్తేభవిక్రీడితం
బది దాక్షాయణిసూచె కౌతుకరతైకాలీన భావాభిలా
షదృగత్యుజ్జ్వలదీధితుల్ పఱపె నీశానాననాబ్జంబుపై. 101

వ॥ తదవసరంబునం బరమేశ్వరుండు నిజజీవితేశ్వరి కన్నెలింగి దానికి సమ్మతించినంగని సంతోషించి, 102

కం॥ సతి కరిణియగుడుఁ ద్విజగ
త్పతిగరియైకూడె సతులు భావించిన యా
కృతిఁగూడ నేర్ప కాదే
యతిశయముగ నింగితజ్ఞులగు ఫలమెందున్.

తే॥ ఆదిమూర్తులు శివశక్తు లచలమతులు
హరుఁడు సతియును సురతార్థులై విహీన

తెరములగు మృగరూపముల్ దాల్చిరనిన
గాముమాయల నెవ్వారు నేమిగారు. 104

కం॥ హరుఁడును పతి రతిఁదనుపఁగ
భరమై గజకేళిఁగూడి పడసెనుసుఖ మిం
కొరులెట్లనేర్తు రోకమెయిఁ
గరణంబులు పెక్కులేక కాంతలఁదనుపన్. 105

కాన కాముక వ్యాపారము సకల ప్రాణికోటికిఁ దుల్యముగానే నడచె నేమోయనిపించును. చోడకవి పైనిజతిరించిన మదనాగముల కాముక కేళి, భవభూతి మహాకవి యుత్తర రామచరిత్ర తృతీయాంకమున-ఛాయాంకమున- శ్రీరామునిచే వర్ణింపఁబడిన, తన పెంపుడు ఏనుఁగు పిల్ల ప్రౌఢవయస్సువచ్చినపుడు కరిణితో నీ క్రింది శ్లోకమునఁజేసిన శృంగారచేష్టలు స్మరణకుఁదెచ్చును.

రామః:—సఖి వాసంతి, పశ్య కాంతానువృత్తి చాతుర్యమపి శిక్షితం వత్సేన.

శ్లో॥ లీలోత్ఖాత మృణాళకాండ కబళచ్ఛేదేషు సంపాదితాః
పుష్యత్పుష్కర వాసితస్య పయసో గండూషసంక్రాంతయః
సేకశ్శీకరిణా కరేణ విహితం కామంవిరామే పున
ర్యత్స్నేహా దనరాళనాళనళినీ పత్రాతపత్రంధృతం. 3-16

ఆంధ్రీకరణము :

రాముడు :—సఖీ వాసంతీ, ఈ చిరంజీవికి దన భార్యను సంతోషపెట్టు చాతుర్యము కూడఁ గలదుసుమా చూడుము.

ఉ॥ ప్రేయసి తూళ్ళు మెక్కినతఱిన్ గనిపెట్టుచునిచ్చె నోటికిన్
దోయజ వాసితంబయిన తొండముగోసిజలంబు, పీపునన్
హాయిగనీళ్ళుచల్లెఁ దనహస్తముతో, మఱి దానినెత్తిపైఁ
ఛాయనికూరిమిన్ గొడుగుపట్టె సనాళ సరోజపత్రమున్.

ఇట్టి శృంగార చేష్టలను వర్ణించుటలో కవులు దక్షులు.

మఱియు చోడకవి తారకాసుర సంహారానంతరము శివశక్తుల యర్ధనారీశ్వర రూపము నిట్లు చిత్రించెను.

కం॥ మనసు లొడఁగూడి కడసన
దనువులు నెఱయంగ వేడ్కదంపతులకు వా
రని సంయోగము గలిగిన
నసిశము నది యర్ధవిరహ మనఁదగు జగతిన్. 10-207

వ॥ అని నిశ్చయించి శివశక్తు లత్యంతానురక్త చిత్తులై నిరంతర సుఖం బునం దనివి సనక,

సీ॥ పృథుజటాబంధంబుఁ బెన్నెఱి వేణియుఁ
గపిలాంబకముఁ గల్కికాఁకిలు కన్ను
నహికుండలంబు తోయజ కర్ణపూరంబు
గడ్డంబు జిగిఁదొలుకాడు చెక్కు
గురుభుజాదండంబుఁ గోకులహస్తంబుఁ
దనరారు నురమును ఘనకుచంబుఁ
బులితోలు మేలిదువ్వలువు నంచితపుష్ప
చయ పరాగంబు లాత్మారసంబు

గీ॥ మానితముగ నిరంతర మదనసుఖము
వొడవుదాల్చెనో యనఁబోలు పొందుగాఁగ
నర్ధనారియై యున్న సర్వాత్ముఁ గనిరి
తారకారియు నఖిల బృందారకులును. 12-209

ఈ విధమున 'మదనసుఖము వొడవుదాల్చెనో యనఁబోలు' నట్లుగా పార్వతీపరమేశ్వరుల సంధానము వర్ణింపఁ బడుటయు చమత్కారము గదా.

పై శృంగార మాభిజాత్యము గల నాయికా నాయకులందుఁ బోషింపఁ

బడినది. చోడకవి జలధి శృంగారమును, సాధారణసంసారుల శృంగార మును గూడ వర్ణించి చూపినాఁడు. ఇందుగల భేదము స్పష్టమగుచునే యుండును.

జలధి శృంగారము :

జారస్త్రీ శృంగారచేష్టల నిట్లు చోడకవి వర్ణించినాఁడు.

ఉ॥ సన్నలు వాఱఁబల్కుచుఁ, గుచంబులుసూపుచుఁ, గెల్లగించి కే్రి
గన్నులఁదూఱఁ జూచుచు, మొగంబునకున్ మురిపంబుఁ దెచ్చుచున్
చిన్నటి నవ్వునవ్వుచుఁ, జెన్నటివేణులు సప్పటించుచుం
జెన్నొదవించుచున్, జలధి చెయ్వులు దాల్చిరి జార కామినుల్ 8-101

ఇందు జారస్త్రీలు విటులనాకర్షించుటకై చేయు నీచ శృంగార చేష్టలు తేటతెలుగు మాటలలోఁ జక్కగ వర్ణింపఁబడినది. వారి హావ భావ విలాసములకును వెనుక పార్వతీవర్ణనలలోఁజూపిన మృదుమధుర భావ ములకు నెంతయో భేదము గనుపించును. ఇవి యా పాత్రలకు నుచిత ముగ చక్కగఁ జిత్రింపఁబడినవి. ఇదియు శృంగారమే కద. ఇందలి శృంగారచేష్టలు పచ్చిగానుండి బట్టబయలుగాఁ జేయఁబడినవి. ఇట్టివి విటులకును భామరులకు ప్రీతిజనకములుగదా. కానయీరకపు శృంగార భేదమునుగూడ చోడకవి వర్ణింపవలసినవాఁ డయ్యెను. ఈ క్రిందిపద్య మున నొక జారస్త్రీ మనోహర రూపమును కవి వర్ణించినాడు.

చ॥ అనుపమ దివ్యమూర్తి, దరహాసవిలాస విభాసి, నిండుజ
వ్వనిసుకుమారి, దన్నువిటవర్గమునల్లడ వచ్చిప్రీతితోన్
గనుకనిమూరిఁజూడ, నెడగానక సూరెలువారుచుండె, మో
హినియనుబోలె నొక్కశరదిందునిభానన నిల్చి ముంగిటన్. 8-124

విటులాశింపఁగా నొక యువతి మనోహరరూపముతో ముంగిటకువచ్చి నిల్చి వారల నూరించిన దట. ఇదియు ప్రకృతిసిద్ధముగా చిత్రింపఁబడి నది. పై పద్యమునఁ గులటల సహజమైనచేష్టలు వర్ణితముగాఁగ నిందట్టి వాని రూపము చిత్రితమైనది. రచనా విధానముగూడ భావానుగుణముగను, పాత్రశీలానుకూలముగఁ జేయఁబడినది. ఆ జవ్వని విటులకు మోహినివోలె నుండుట సహజమే గద. అందులో నామె 'యనుపమ దివ్యమూర్తిదరహాసవిలాసవిభాసి'యై చూచి ప్రక్కలకుఁబోవుచుండె నఁట. ఇఁక నాజారస్త్రీల కృత్రిమప్రేమ వర్ణనము నిట్లు చోడకవి చేసి నాఁడు.

చ॥ కలువక కల్పినట్లు, దమకంబెద లేకయుఁ గల్గినట్లు, చేఁ
గల విటువర్గమంతయును గైకొను నంతకుఁ బొచ్చపోక చేఁ
గలపురుషెయ్యెడున్ విడిచి గ్రక్కున నెక్కుడి యేగి వానిఁగాఁ
దలఁచి ధనేతరున్ మదను దా నొరుఁగల్వమి నేర్పు వేశ్యకున్.
8–142

వేశ్యల నటనలు, మోసమును, కృత్రిమ ప్రేమ జూపుట వారి స్వభావముగద. తర్వాతి వారి సంభోగశృంగారమిది.

ఉ॥ భావజ కేళి నచ్చుపడి పైఁబడి, తద్విటు నిచ్చఁగూడి రాఁ
గా వివిధోపచారములఁ గామసుఖంబుల నల్పిపుచ్చి, తా
రో వెలఁదీగి, యొండొకనిరోయఁదగన్, వెలయాలికూటముం
బూవుల మేలికంపుఁదమపొందున కాకటమీఁద నిల్చునే.
8–158

జారస్త్రీ యనేకపురుషసంగమమునుగోరి చరించునుకదా. ఈవిధముగ సంభోగ శృంగారము గూడ పాత్రల శీలానుగుణముగ భిన్నరీతిని స్వభావసిద్ధముగనే చిత్రింపఁబడినది చోడకవిచే.

సాధారణ సంసారుల శృంగారము :

పార్వతీపరమేశ్వరుల శృంగారరసపోషణ మాదర్శప్రాయముగ తీర్చి దిద్దఁబడినది. ఇందు కవితాకళ యంతయు సార్థకముచేయఁబడినది. ఇట్టిది సాధారణ సంసారుల శృంగారమువ ప్రతిపాదించుట కష్టము. ఇఁక జలభి శృంగార మందలి నైచ్యమును, రోఁతయు, నసభ్యతయు పైని దిలకించితిమి. కాన సాధారణసంసారుల శృంగారానుభవ మెట్లుం డునో చోడకవి తగిన సన్నివేశములలోఁ జిత్రించినాఁడు. వివాహాము నకుఁ దరలిపోవు నీశ్వరుని పురవీథులలోఁ జూచు స్త్రీలను వర్ణించునపు డీవిధ శృంగారమును చోడకవి పోషించినాఁడు. వారి హావభావ విలాసములు నిరవద్యములుగఁ జిత్రింపఁబడినది

చ॥ నుతనవయౌవన ద్యుతి దనుద్యుతికిన్ మెఱుఁగీఁగఁ, దత్తనూ
ద్యుతి మణిభూషణద్యుతుల కొప్పముతో మెఱుఁగీఁగఁ, దన్మణి
ద్యుతులు నభోమణిద్యుతులతో నెనయై, దన వక్త్రపంకజ
ద్యుతులకు నీమెఱుంగు లోకయుగ్మలివచ్చెఁ బురారిఁ
జూడఁగాన్. 8-56

ఇందు కారణమాలాలంకారమున నన్యాతిశయంబుగ యౌవన కాంతి శరీరకాంతి, యాభరణముల కాంతి, వదనకాంతియు గల యొక స్త్రీ సౌందర్యము వర్ణితమైనది. ఈ క్రింది పద్యమున నలంకరించుకొనిన మఱియొక స్త్రీ విలాసము మనోహరముగఁ జిత్రింపఁబడినది.

చ॥ నునుపుగఁ జందనంబలఁది, నూతన మౌక్తికహారముల్ ఘన
స్తనయుగళంబుపైఁ బొలయ, జాదులు వేణిఁ బెనంగఁ, దెల్పుతోఁ
గనుగవ గ్రాల, దువ్వలువఁ గట్టి తదుజ్జ్వల కీర్తిమూర్తి సే
కొని చనుదెంచులీల నొకకోమలి వచ్చె గిరీశుఁ గన్గొనన్. 8-59

ఇం దభిసారికాలక్షణములు ప్రతిపాదింపబడినవి. ఈమె చక్కఁగ నలంకరించుకొని యా 'యుజ్జ్వలకీర్తి సేకొని చనుదెంచులీల' వచ్చినదఁట.

ఈ క్రిందిపద్యమున నొకయువతి తన ప్రియునితో రతిననుభవించినదై తదానందాది చిహ్నముల వెలువరించుచు వచ్చి శివునిఁ జూచినదఁట.

చ॥ కమలదళాక్షి, సాలఁదమకంబునఁ గూర్చు నిశేశుతోడఁజి
త్తము దనివోవఁగా, బహువిధంబులఁ గూడిన హృద్గతానురా
గము వెలిఁ బేర్చెనో యన, నఖక్షతచుంబన రంజితాంగవి
భ్రమగతివచ్చిచూచె నొకభామిని జంగమమల్లికార్జునిన్. 3-61

ఇందు స్త్రీల యనురాగపూరిత సురతానందానుభవము సహజముగఁ చిత్రింపఁబడి హృదయరంజకముగ నున్నది. రచనగూడ భావలాలిత్యమున కనుగుణముగ మృదువుగ ప్రసాదగుణముతో నొప్పినది. ఇఁక ప్రౌఢాంగన సురత వ్యాపార చిహ్నప్రదర్శన మిట్లు చోడకవి చేసి చూపినాఁడు. ఇది కొంచెము ముదిరినపాకము గలది.

చ॥ గురుకుచలిప్తసాంద్రతర కుంకుమచందన ఘర్మబిందువుల్
దొరుగ, రతిశ్రమాకులిత, ధూర్జటికొక్కతె సూచుచుండెఁ, గే
సరినఖరాగ్రనిర్దళితసక్షతజాతవిమిశ్రమౌక్తికో
త్కరగళదుచ్చకుంభ మదదంతియుపోలె నచేతనస్థితిన్. 8-60

ఈ పద్యము తద్భావానుగుణముగ రజోగుణముతోఁ దీర్పఁబడినది. ఆ ప్రౌఢాంగన 'రతిశ్రమాకులిత' 'నచేతనస్థితిన్' మదదంతితోఁ బోల్పబడినది. ఆమె 'గురుకుచ' గావున 'నుచ్చకుంభ మదదంతి' యగుటయు సమంజసమే. అందలి ఘర్మబిందువులు, 'కేసరి నఖరాగ్రనిర్దళిత సక్షత జాత విమిశ్ర మౌక్తిక'ము లగుట సరసములై భాసిల్లినవి. చోడకవి యిట్లు వివిధమైనశృంగారములను తదనుగుణముగఁ బాత్ర పోషణతోఁ జిత్రించి తన ప్రతిభను జాటినాఁడు.

తర్వాత యుద్ధమునకుఁబోవు సైనికులు దమ ప్రియులతో జరిపిన శృంగార సరససల్లాపాది హావభావవిలాసాదుల వర్ణనే మఱియొకమాఱు సాధారణ సంసార స్త్రీలందు శృంగారరసము నిట్లు పోషించి

రంజింపఁజేసినాడు పాఠకుల. ఇదిమఱియొకతీరున నిరవద్యమై సాగినది.

కం॥ అన్నుల తిన్నని నవ్వులఁ
బన్నిన ముఖచంద్రరుచులు పరవ్రగఁదమపై
వెన్నెలఁ బయనము సడచిన
చెన్నునసుఖలీల నమరసేనలు నడచెఁ. 11-26

సీ॥ భాషామృతంబులఁ బతులచేతో భూమి
నసురాగబీజంబు లంకురింప
వదనేందుదీప్తుల వరుల మనోగ్గత
స్నేహ రసాబ్ధులు నిట్టగ్రమ్మ
రుచిరారుణాధర రుచుల నాత్మేశుల
హృత్ప్రియాబ్జంబు లెలమి నమర
నిశ్వాసదక్షిణా నిలములఁ బ్రియచిత్త
గత మోహలత దిలకితముగాఁగ

గీ॥ ఘనపథ శ్రమాంబుకణతతి రెట్టించె
ననఁగ భావసురతజనిత ఘర్మ
జలము పల్లభాంగములనొప్ప నమరీస
మేత మమరసేన ప్రీతినడచె. 8-27

ప్రియురాండ్రదరహాసరసపల్లాపామృత పానమున సైనికులు సుఖముగ ప్రయాణశ్రమ లేకుండ నడవసాగిరఁట. మఱియుఁబ్రియుల వాగమృత సేవనమునఁ బ్రియుల మనస్సులం దనురాగబీజము లంకురించి, తమ వదనేందు కాంతులచే వారి స్నేహ మభివృద్ధినొంది, తమ రుచిరారుణాధర రుచుల చేత వారి ప్రణయము వికసించి, తమ నిశ్వాస మలయమారుతముచే వారి మోహలత కూసందింపఁగా, ప్రయాణ శ్రమాంబుతతి వారి "భావసురత" జనిత ఘర్మజలమున నొప్పినదని విచిత్రముగా శృంగార రసమును చోడకవి బహుక్లుప్తముగా, లఘు

పుగా ప్రతిపాదించినాఁడు. తరువాత నా వీరపత్నుల విరహములను గూడ చమత్కారముగ వర్ణించినాఁడు. ఈ లోకమునఁ దమప్రియులు దమ్ము విడిచిపోవుటచే విరహచింతయుఁ దమ్ము విడిచి స్వర్గలోకమునకుఁ బోయి యక్కడ నప్సరస్త్రీల సమాగమమును గోరఁబోవు దమ ప్రియులపైఁ గోపము వహించి, ఖండితనాయికా లక్షణములతో సురాంగనలఁ గూర్చి యసూయ చెందుటయు నిందు రమణీయముగఁ జిత్రింపఁ బడినది.

ఉ॥ ఓలము లేదుకూర్చునని యూఱడియుండితిఁ గూర్మియెల్ల నేఁ
డాలము సేసి నన్నుఁ బెడయాకులఁ బెట్టి మనఃప్రియుండు ద
న్నాలములోనఁ బెట్టి, దివిజాంగనలం గలయంగ నెత్తె నే,
నాలనె బేలఁగాక చెలియా! యల్లనవ్రాలె సోలుచున్ 11-55

చ॥ అనిమొననిల్చి వీరగతినందుఫలం బిదియెల్ల దేవతాం
గనల ముదంబునంగలయుగాన్ప నిజంబిది, నన్ను దేవకా
మినినసుర క్రీఁగ్రైకొని రమించుచునుండియు నింకనాజినే
మనియొకొ త్రెవ్వఁజూచెఁ బ్రియుఁడంచుఁ జలించె లతాంగి
నెమ్మదిన్. 56

ఇట్లు వీరపత్నులవిరహముగూడ వర్ణింపఁబడినది. ఈవిరహమునఁ జమత్కారమును, హృదయ రంజకత్వమును గలదు. ఇన్ని విధములైన శృంగారములను చేసి చోడకవి దన కావ్యమును శృంగారరస ప్రధానముగఁ జేసినాఁడు. శృంగారరసమును యుద్ధభూమియందుఁగూడఁ బ్రతిపాదించిన కవి సామాన్యముగఁ గానరాఁడు. శృంగార రసమున లోఁతెఱిఁగినవాఁడీ చోడకవి. మిగిలిన రసములనుగూర్చి మఱియొకమాట ముచ్చటించెదను.

# వసన్తరాజీయములోని కొన్ని శ్లోకములు

అథాంగస్ఫురణం—వసంతరాజీయే

బ్రూమోఽధునాఙ్గ స్ఫురితస్యసమ్యక్ ఫలేత్యేక మప్యఙ్గలవస్యభావమ్
సర్వత్ర యాత్రాసమయేస్వదేహే హ్యుత్పద్య తేఽఙ్గస్ఫురణంచకస్మిన్
మూర్ధ్నిస్ఫురేచ్ఛాశు పృథివ్యవాప్తి స్థానస్య వృద్ధిశ్చ లలాటదేశే
భ్రూఘ్రాణభేదే ప్రియసఙ్గమఃస్యా న్నాసాగ్రదేశే సుయశోభిలాభః
దృగంతమధ్యస్ఫురణేర్థసంప దాత్కృష్టతాస్యా త్స్ఫురితేదృగాదౌ
భంగాద్దృశోథ స్ఫురణేఽరణేస్యాత్ ప్రియశ్రుతి స్స్యాత్స్ఫురితేచ కర్ణే
యోషిత్సమృద్ధిః స్ఫురితేచ గణ్డే ఘ్రాణేతు సౌగన్ధ్యముఖా భవేతామ్
భోజ్యేష్టసంగా వధరోష్ఠ యోశ్చ స్కంధే గళే భోగవివృద్ధి లాభౌ
స్పందోభుజ స్యేష్టసమాగమాయ స్పందఃకరస్య ద్రవిణాప్తి హేతుః
స్పందశ్చపృష్ఠస్య పరాజయాయ స్పందోజయశ్చోరసి మానవానామ్
పార్శ్వప్రకంపే భవతిప్రమోదః స్తనప్రకంపే విషయస్యలాభః
కటిప్రకంపేచ పతిప్రమోదో నాభిప్రకంపే నిజదేశనాశః
ధనర్ద్ధి రంతఃకరణప్రకంపే దుఃఖస్యచాప్తి ర్హృదయప్రకంపే
స్ఫిక్ప్రాయుకంపేఽపిచ వాహనాప్తి ర్వరాంగకంపే వరయోషిదాప్తిః
గుహ్యేసకంపే తనయస్యజన్మ వస్తిప్రకంపే యువతి ప్రవృద్ధిః
బాహుప్రకంపే ప్రియసఙ్గమస్స్యాదూరుప్రదేశేషు సహాయలాభః
స్వాజ్జానుకంపేఽరిపరేణ సన్ధి ర్జంఘాప్రకంపేఽపిచ లాభనాశః
యానాప్తిరూర్ధ్వం చరణస్యకంపే యాత్రాప్రిలాభాంఘ్రితలస్యకంపే
పుంసాంసదా దక్షిణదేశభాగే స్త్రీణాంచ వామావయవేషుజాతేః
స్పందేఫలాని ప్రతిశం త్యవశ్యం హీనస్థితిచోక్తాంగ విపర్యయేణ.

కుమారగిరిరెడ్డి, వసన్తరాజీయ మను నాట్యశాస్త్రగ్రంథమును రచించినట్లు, కాటయ వేమారెడ్డి సంతరించిన, అభిజ్ఞానశాకుంతల ప్రారంభశ్లోకములనుబట్టి స్పష్టముగఁ దెలియు చున్నది. కాటయవేముఁడు, మల్లినాథసూరి కుమారస్వామిసోమపీథియుఁ దమవ్యాఖ్యానము లలో వసన్తరాజీయమునందలి కొన్ని శ్లోకముల నుదాహరించియున్నారు. సమగ్రగ్రంథ మింతవఱకు నెవ్వరికిని దృష్టిగోచరము కాలేదు. పరిషత్తునందున్న (వ్రాఁతప్రతి) సంస్కృత వ్యాకరణగ్రంథమునకు ముఖపత్రమునం దీ క్రింది శ్లోకములు గానవచ్చినవి. వానిని పాఠ కుల సమక్షమునఁ బెట్టుచుంటిని.

సంపాదకుఁడు.

# శ్రీ కాళిదాస సౌందర్య సమారాధనము—విశ్వప్రేమము

ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి.

మనము ప్రకృతిసౌందర్యమును దిలకించినపుడు ఆనందభరితుల మగుచుందుము. ఇట్లే "అజంతాది" శిల్పము, శ్రీనివాసుని దేవాలయ శిల్పము మున్నగు శిల్ప సౌందర్యములను జూచినపు డవి మన మానసములలో సుమధుర మధురానుభూతులనుదయింపఁ జేయుచునే యుండును. కనుక "సౌందర్య"మనునది నిత్యసంతోషజనకమై, యఖండానందము నమరఁజేయుచుండునని వ్యక్తమగుచున్నది
పై "సుందర" శబ్దార్థము గురుబాలప్రబోధికలో నిట్లు నిర్వచింపఁబడినది. "సుతరాం ఆద్రియత ఇతి సుందరం" "దృఙ్ ఆదరే" మిక్కిలి సంతోషపెట్టునది. "కీట్సు" (Keats) అను పాశ్చాత్య కవి+పై విషయమునే

"A thing of beauty is a joy for ever"

"సౌందర్యము నిత్య సంతోషదాయకము" అని తెలిపినాఁడు.

కనుక నీ దృశ్యమాన ప్రపంచములోని 'సుందర' వస్తువులన్నియుఁ గనువారి కందోయికి విందొనర్చుచు, ఆనందదాయకములగుచున్నవని వ్యక్తమగుచున్నది. వస్తునిష్ఠమైన యీ 'సౌందర్యము' మానవుల యాత్మవృత్తిద్వారా అనుభవింపఁబడుచుండుటచే "నిది వస్త్వాశ్రితమే కాని ఆత్మాశ్రితము కాదు" అను విషయము గూడ విశద మగుచున్నది.

ఇట్టి "సౌందర్య" మీ చరాచర ప్రపంచము నాశ్రయించి యున్నట్లే కావ్యప్రపంచమును గూడ నాశ్రయించియున్నది. ఉదాహరణకు- కాళిదాసకవి కావ్యములను గనువారును, వినువారును అందలి

---

+ ఇతడు ఇంగ్లండులో జన్మించి క్రీ. శ. 1821 వఱకు నున్నవాఁడు. ఇతని రచనలు సౌందర్యతత్త్వబోధకములై యుండును. ఇతఁడు ముందు వైద్యుఁడై యావల సారస్వతోపాసకుఁ డైనవాఁడు. 5 సంవత్సరాల కావ్యరచనతో నాంగ్ల వాఙ్మయ పీఠమున శాశ్వతముగ నధిష్ఠించినవాఁడు. (చూ. 'కాళిదాస కవితా అనుబంధము)

సన్నివేశములు, అతి సుకుమార సౌందర్య సందేశ సంభరితము లని తనివితోఁ దమ తలలూపుచుండుట• విజ్ఞులకు విదితమైనదే. కనుక సుందరాత్మకమైన కళాప్రపంచమునకు సంబంధించినదే "శాశ్వత సౌందర్యమ"నఁదగి యున్నది. ఈ విషయమే శుక్రనీతిసారములో
"శాస్త్రమానేన యో రమ్యః సరమ్యోనాన్య ఏవహి" (14-4-104)
"సత్కావ్యాశ్రిత మైనదే సౌందర్య మ"ని చెప్పఁబడినది. అనఁగా మహాకావ్యములలోఁ జిత్రింపఁబడిన శకుంతలాదుల సౌందర్యము ఆ శకుంతలాదు లిపుడు లేకున్నను, వారి దివ్య సౌందర్య మణికాంతులు మహాకవుల కావ్యాదర్శములలో నిత్య సన్నిహితములై, యాచంద్రతారకముగఁ బ్రకాశించుచునే యున్నవి.

భారతీయకవితాసౌందర్యము పాశ్చాత్యకవితాసౌందర్యములన్నిటిలోఁ బ్రత్యేకప్రాతినిధ్యము వహించిన దనవలెను. కారణ మేమనఁగా, నిది కేవల భౌతిక విషయలంపటమైనది కాక, ఆధ్యాత్మిక భావనా భాసితమై, ప్రపంచ మాంగళ్యమునకు బద్ధకంకణమై పరిఢవిల్లి యున్నది. ఇది యిట్లుండ, కాళిదాసుని కాలములోఁ బ్రవృత్తితోపాటు నివృత్తి మార్గము మంగళదాయకముగఁ దలంపఁబడుచుండెను. ఇందును భారతీయులు స్వతః ఇంద్రియములకు దాసులు కానివారు. ఏత దనుకూలముగనే యానాఁటి కవిత సాగవలసియుండును గదా! మఱియు నీ కవి కాలములోఁ "బ్రకృతిపురుష భావన" వ్యాప్తిలో నున్నటున్నది.

• "కింకవేస్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతా పరస్యహృదయే లగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః" ఏ కావ్యముకాని యే బాణముకాని ప్రయోగించినంతనే అది యెదుటివారి హృదయములో నాటుకొని, వారి తల లూపింపఁజాలదో అట్టి కావ్యముకాని, అట్టి బాణముకాని నిరర్థకమైనది. విన్నంతనే సంతోషములో తల లూపింపలేని కావ్యముకాని ప్రయోగించినంతనే గుండెలో గ్రుచ్చుకొని వాని తల వ్రేలాడఁజేయలేని బాణముకాని నిరుపయోగమని భావము. "గాథే" యను యూరపియన్ కవి శాకుంతలముఁ జూచి సంతోషభరితుఁడై నాట్యముచేసినాఁడుకదా!

గనుకనే కాళిదాసు మున్ముందుగా ప్రకృతి రూపములైన ఋతువుల నారాధించి (ఋతుసంహార రచన) పిమ్మట 'పురుషుని' తో 'ప్రకృతి'ని సమ్మేళనము గావించుటకై, ఏతదనురూపమైన 'కుమారసంభవ కావ్యము'నారంభించినాఁడు. ఇట్టిసమన్వయమున కీతఁడొకఁడేయర్హుఁడు గాన తత్కాల యుగ సమన్వయ సిద్ధాంతమున శ్రీ కాళిదాస మహాకవియే యుగాద్యుఁడనఁ దగియుండెను

ప్రస్తుతమున నితని సౌందర్య వర్ణనాతత్త్వము భారతీయ తత్త్వమును బ్రకాశింపఁజేయుచు "సత్యం-శివం-సుందరం" అను సూక్త్యర్థమును వివరించుచున్న ట్లున్నది. మఱియు సౌందర్యోపాసకుఁడైన యీ కాళిదాసు సమ్యక్ దృష్టితో సౌందర్యము నారాధించిన ట్లితని కావ్యోదాహరణములు స్పష్టీకరించుచున్నవి. ఈ విషయము విశదమగుటకై యితని సౌందర్య వర్ణనము పూర్వోత్తర భాగములుగ విభజించితిని. ఇట్టి విభాగముచేఁ బూర్వభాగములోఁ గేవల భౌతికముగఁ గానవచ్చుచున్న సౌందర్యము ఉత్తర భాగములోఁ బవిత్ర తపశ్శక్తి భాసురమై యలౌకిక మగుచు, జగన్మాంగళ్యమునకు మంగళ తోరణ మగుచుండును.

బంగారమైనను నయ్యది యగ్నిలోఁ దప్తమైన పిమ్మటనే యందలి మాలిన్య మంతరించి, యద్దాని నిజకాంతి ప్రజల నేత్రములకును గాత్రములకును మంగళాలంకార మగుచుండును. ఇందులకు దేశకాలాదిభిన్నత బాధకము కానేరదు. ఇట్లే యెంతటిసౌందర్యమైనను అది, తపోనియమాదులచే సంస్కృతమై, సౌశీల్యాది గుణసంపదచే నిర్మలమై, పవిత్ర చరిత్రచేఁ బావనమై ప్రకాశించిన పిమ్మటనే యద్దానియందలి 'సత్య'శోభ సందీప్తమై యది లోక 'శివం'కర మగుచుండును. ఇట్టి 'సౌందర్య'మే మన భారతీయ సంస్కృతికి మకుటమై ప్రపంచ ప్రశస్తికిఁ బాత్రమై ప్రకాశించిన రీతి, నిఁక వివరించెదను.

సర్వమంగళా దేవి రూపవైభవ మెంతటి కవితా వైభవముతో నీ కవీశ్వరునిచేఁ జోషింపఁ బడినదో పరిశీలింపుఁడు.

"ఉన్మీలితం తూలికయేవ చిత్రం సూర్యాంశుభిర్భిన్న మివారవిందం
బభూవ తస్యా శ్చతురస్రశోభి వపుర్విభక్తం నవయౌవనేన.

(చూ. కుమారసంభవము, సర్గ-1, శ్లో-32)

చక్కని సాముద్రిక లక్షణములుగల శర్వాణి శరీరము క్రొంగ్రొత్త జవ్వనముచేఁ గ్రొత్తగను, వేఱు వేఱుగను విలసిల్లుచున్న విశిష్టావయవములతో విరాజిల్లుచుండెను. అట్టి యామె రూప మెట్లుండె నన, రంగుకుంచియల రంజనద్రవ్యముచే రమ్యముగ రంజిత మగుటచే వినూతముగ విలసిల్లుచున్న రేఖాచిత్రము వలెను, సూర్యకిరణ ప్రసారములచే వికసితమై, నవవికాసామోదములతోఁ బ్రత్యక్షముగఁ బ్రకాశించుచున్న పద్మము వలెను బ్రకాశించెను. అనఁగాఁ జిత్రములో నణఁగి యున్న యందము రంగు కుంచియలచే వ్యక్తము సేయఁబడినట్లును, పద్మములో నాచ్ఛాదితమై యున్న సౌందర్యము సూర్య కిరణములచే సుస్పష్టముగ రాణించినట్లును, శర్వాణిలో స్వతస్సిద్ధముగ నున్న యందము, అప్పటి యౌవన ప్రాదుర్భావముచే నుజ్జ్వలమై యుద్భాసితమయ్యెను.

పై శ్లోకము పార్వతీ సౌందర్య వర్ణనమునకుఁ బ్రారంభమై ఈ కవీశ్వరుని "సౌందర్య సమారాధన"కు ముందు, తత్సిద్ధికైన యీ మహాకవియొక్క మంత్రజపము వలె భాసించుచు, నీ సర్గము నంతను భాసింపఁజేయుచున్న ట్లున్నది. ఏమందురా? ఈ కవి యిట పదునొకండక్షరములు గల "ఇంద్రవజ్రోపేంద్రవజ్రావృత్తము"ల నుపయోగించినాడు. కనుక మన కవీశ్వరున కీ వృత్తము ఏకాదశాక్షరీ మహామంత్ర జప ఫలితమును ప్రసాదించుచు• 'సౌందర్యారాధనము'కు

---

• "ఏకాదశరుద్రా" అని యుండుటచే ఏకాదశత్వవిశిష్టేశ్వరారాధన మిట సూచితము.

సీతని యర్హతను సూచించుచున్నది. చూడుఁడు. శ్రీ ఆదిశంకరులు తమ సౌందర్యలహరీ స్తుతిలో "తుహిన గిరికన్య" యొక్క సౌందర్యమును వర్ణించుచు,

"త్వదీయం సౌందర్యం తుహినగిరికన్యే! తులయితుం కవీంద్రాః కల్పంతే కథమపి విరించిప్రభృతయః — — —" అని.

గిరిజా సౌందర్యవర్ణనకు బ్రహ్మాదులే సమర్థులన్నారు. కనుక నిట యేవంవిధవర్ణనము సేయుచున్న మన కాళిదాస కవిబ్రహ్మ, "విరించి" యే కావలయును. మఱియుఁ దపఃఫలములన్నిటిని స్వయముగ భక్తుల కీఁజాలిన "ఈశ్వరుఁడు" ఏదో కోరికతోఁ దపస్సు చేసినాఁడని కవి భావము. "స్వయం విధాతా తపసః ఫలానాం కేనాపి కామేన తపశ్చచార" (1-57) అవాప్త సర్వకాముఁడైన యీశ్వరుని కిట పార్వతీ సౌందర్య సర్వస్వలాభ సముత్కంఠ వినా వేఱొక కోరిక యేముండును? పార్వతీ పరమేశ్వరులు "పరస్పర తపస్సంపత్ఫలాయిత పరస్పరము"కలవారుకదా! కాఁగా 'ఈశ్వరుఁడు' కూడఁదాను తపస్సుచేసిన పిమ్మటనే పార్వతీ సౌందర్యతత్త్వము పొందఁదగినవాఁడు" అని యిట సూచితమగుచున్నది. ఇంతటి 'మహా సౌందర్యము'ను వర్ణించుట కిట ఆదిశంకరు లనినట్లు మన కాళిదాసమహాకవి విరించి (బ్రహ్మ) వినా- ఒక భారతీయ సౌందర్య తత్త్వవేది వినా- వేఱొక రెట్లు సమర్థు లగుదురు ?

పై విధముగ ఈశ్వరుఁడు తపశ్చరణముచే బ్రహ్మతేజోవిరాజమానుఁడై (5-30) నైష్ఠిక సుందరుఁడగును. (5-62) * పార్వతీ దేవి కూడ పంచాగ్నిమధ్య తపశ్చరణాది కృచ్ఛ్రతపః కృశయై, సత్య

---

* వైముఖ్యముతోఁ గూడిన యింద్రియ సుఖానుభవమునుండి ఆధ్యాత్మిక సుస్థితిని లభింపఁజేయఁ జాలినదే "నైష్ఠిక సౌందర్య" మని రవీంద్ర కవీంద్రుని యాశయము.

సౌందర్య సందీపితమై, యీశ్వరుని యర్థాంగలక్ష్మి యగుటకుఁ బాత్రమై యుండును.

ఇంతటితోఁ బార్వతీసౌందర్యము ఆధ్యాత్మిక తేజస్సంభృతమై ఆదిదేవునంతటివాని కాదరణీయము కాఁగల్గినది. ఈశ్వరుఁడుకూడ నింతకు ముందు యోగాభ్యాస బలమున "పరంజ్యోతిని'' దనలో దర్శించి (3-58) ఆధ్యాత్మిక తేజస్సంపన్నుఁడై "సత్యం శివం సుందరం" అను సూక్త్యర్థమునకుఁ జక్కని నిదర్శనమై పార్వతీదేవి పాణిగ్రహణ భాగ్యముతో నిట్లిరువురును జగత్పిత లగుచున్నారు.

ఇట్లు జగన్మాంగళ్యమునకు సారవత్కారణమైన పార్వతీ సౌందర్య సర్వస్వమును, పై శ్లోకము ("ఉన్మీలిత'' మ్మనుదాని)లో నిక్షేపించి యీకవి తన "సౌందర్యసమారాధన'' ప్రబంధమున కీశ్లోక మును నాందిగాఁజేసికొనుట యుక్తము. ఇంతటి మహత్తరసౌందర్య ర్థమును వివరించుటకు డాక్టర్ శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి "సౌందర్య మీమాంస'' అనువ్యాసమునుండి• కొన్ని వాక్యముల నిట ఉల్లేఖించెదను.

"చిత్రము షడంగకము— "రూపభేదాః ప్రమాణాని భావలావణ్య యోజనం, సాదృశ్యం వర్ణికాభంగ ఇతిచిత్రంషడంగకం.

(చూ. జయమంగళ వ్యాఖ్య।

" — — బాహ్య జగత్తులో సుందరములుకాని వస్తువులు సైతము కళాప్రపంచమున సౌందర్యముగా స్ఫురించఁగలవు. అనఁగా కళాప్రపంచముననే సౌందర్యమున్నదిగాని అన్యత్రలేదు. శృంగారాది రసములుకూడ లోకమునఁగాక, కావ్యముననే కలవు.

"సర్వానుగ్రాహకంహి శాస్త్రమితి" న్యాయాత్ తేన నాట్య ఏవ రసాన లోక ఇత్యర్థః కావ్యంచ నాట్యమేవ"

---

• చూ. 'భారతి' 'సర్వజిత్తు' సంవత్సర శ్రేష్ఠము.

అని, అభినవగుప్తుఁ డనినాఁడు. (చూ. "అభినవ భారతీ" పుట 292)

— — — —

చిత్రమున భావలావణ్యములు (Matter and Form) ఏకానుసంధానాత్మకములు కావలెను.

ఏవం విశిష్టమైన భావలావణ్య యోజన తూలికచే నున్మీలిత మగును. తాదృశ ఉన్మీలనముగా పార్వతిని భావనచేసిన కాళిదాసున కీ యుపమానము రుచింపకపోవుటచే "సూర్యాంశుభి ర్భిన్న మివారవిందం" అను ద్వితీయోపమ చెప్పఁబడినది. చిత్రగత సౌందర్యము కవిభావనా సమున్మీలిత మైన దగుటచే వస్తుతంత్ర (Objective) మైనను, మనోవృత్తి (Subjective) చే నావృత మగుచున్నది. అనఁగా అమర్త్యమైన సౌందర్యమునకు మర్త్యస్పర్శ పనికిరాదు.

చిత్రగతసౌందర్యమున నిదికనబడుటచేతనే ద్వితీయోపమ మహాకవిచేఁ బ్రయుక్తమైనది.

ఇఁక సూర్యకిరణస్పర్శచేఁ బద్మము వికసించుచున్నది. పద్మమునకు మానవస్పర్శ లేదు. రవికిరణజనిత ఉన్మేషమే సౌందర్యాభివ్యక్తి హేతుక మగుచున్నది. అనగా సౌందర్యము జగన్నిష్ఠము కాని ఆత్మనిష్ఠము కాదు. — — పద్మములో లీనమైయున్న సౌందర్యాభివ్యక్తికి సూర్యకిరణములు నిమిత్తములగుచున్నవి. కావున "భిన్న"శబ్దమునకు "ఆచ్ఛాదితమైయున్న సౌందర్యము అభివ్యక్తమగుచున్నది" అని అర్థము చెప్పుకొనవలెను.

ఇక "చతురస్ర శోభివపుః" — — అనగా "చతురస్ర" శబ్దము సౌందర్యాభివ్యక్తి సూచకమైన రూప పరము; లావణ్య పరము — — ఆమె శరీరము చతురస్రత్వమును శోభింపఁజేయునది — ఇట్టిశరీరమున భావలావణ్యముల కేకానుసంధానత్వ ముండుటచే, ఆత్మవృత్త్యధీనమైన సౌందర్యభావన, వస్తు

తంత్రనిష్ఠమైన సౌందర్యయోజన పార్వతిలో లలితవిజ్ఞాన యోజనల• మేళనమునంది, అలౌకిక, ఆధ్యాత్మిక సౌందర్యాభివ్యక్తికి నిర్దేశకము లగుచున్నవి — — — ”

ఇట్లలౌకిక సౌందర్యసజ్జిత యగు పార్వతీదేవియొక్క పాదారవిందముల నీ కవి మొదట ఆరాధింప నెంచినట్లు సులలిత సుకుమార రీతితో "తచ్చరణములు అవ్యవస్థకల స్థలారవింద శోభ నాహరించి" నట్లు వర్ణించినాఁడు. చూ. కుమారసంభవము 1-33) (శ్రీ) ఆది శంకరులుకూడ శర్వాణీచరణస్తుతి సందర్భమునఁ దమ సౌందర్యలహరిలో "... భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛా సమధికం, శరణ్యే లోకానాం తవహిచరణావేవ నిపుణౌ" అని తత్పాదారవింద భజనము కాంక్షితాధిక ఫలప్రద మగుచున్నట్లు తెలిపిరి. ఇఁకఁ దత్పాదాది శిరఃపర్యంత వర్ణనములోఁ గల కొన్ని వర్ణనముల నే యిటఁ గైకొందును.

పార్వతీదేవికంఠశోభ గాంచఁదగినది. లోకములో స్త్రీలకంతా ద్యవయవములు రత్నహారాది భూషణములచే నలంకరింపఁబడును. కాఁగా కంఠమునందు "భూష్య భావము", హారమునందు "భూషణ భావము" అను నివి కవిలోకమునఁ బ్రసిద్ధములై యున్నవి. ప్రస్తుతమున "భూష్యభావ" యుక్తమైన గిరిజా కంఠము "భూషణ భావ", భాసురమైన కంఠహారమునుగూడ నొకప్పుడలంకరించుచున్నది. కనుక ఇంతవఱకు హార, కంఠములందు బ్రసిద్ధమై యున్న "భూషణ"

• ఈ కవి తన మాళవికాగ్నిమిత్ర నాటకములోఁ గూడ
"అవ్యాజసుందరీంతాం విజ్ఞానేనలలితేన యోజయతా। (2-13)
లలితమై విజ్ఞానతంత్రమైన యోజనవలన సౌందర్యాభివ్యక్తి కలుగును. దీనిలో భావ లావణ్యముల కేకానుసంధానత్వ ముండును.
ఇందు రూపానిష్పత్తి "చతురస్ర" శబ్ద వాచ్యము.
(చూ. భారతి సౌందర్య మీమాంస)

"భూష్య" భావము గిరిజా కంఠ విషయమున విపర్యస్తమై పర్యాయముగ నుభయసాధారణమగుచున్నది. (చూ కు.సం.1-42) ఈ విశేషము సామాన్య స్త్రీలోకమునఁ గానరానిది.

అలంకారములు లేకున్నను శరీర మలంకారయుతమైన ట్లందగించుచుండుట "రూప" మనఁ బడును. * ఇట ఉమా రూపమునై 'రూప' లక్షణమును విడువకనే అలంకారములనుగూడ నలంకరించు నంతటి వింతశోభతో విరాజిల్లుచుండుట, మన సౌందర్యారాధనమని సౌందర్య వర్ణనా పాటవమునకుఁ దార్కాణము. ఇఁక ఉమాముఖ వర్ణనము.

"చంద్రం గతా పద్మగుణాన్నభుంక్తే పద్మాశ్రితా చాంద్రమసీ
మభిఖ్యాం *
ఉమాముఖంతు ప్రతిపద్యలోలా ద్విసంశ్రయాం ప్రీతి మవాపలక్ష్మీః
(కు. సం. 1-43)

"శోభాలక్ష్మి (ఆముష్మికమైన) చంద్రుని నాశ్రయించి యున్నపుడు, పద్మగుణాగతానందము నంద లేకున్నది. ఇట్లె ఆ లక్ష్మి భూలోక స్థితమైన (ఐహికమైన) పద్మము నాశ్రయించి యున్నప్పుడు చంద్రుని లోనికాంతిమత్త్వాదులవలనఁ గల్గు నానందము నంద లేకున్నది. ఇట్లా శోభాలక్ష్మి చంద్రారవిందములలో, నేయొక్క చోటను నఖండానందము నందుకొన లేనిదై చంచలయై తుదకు గిరిజా ముఖము నాశ్రయించి, యట చంద్రునిలోని కాంతి శైత్యాదిగుణాగతానందమును, బద్మములోని సౌకుమార్య సౌరభత్వాద్యాగతానందమును ఇట్లు వస్తు

* "అంగాన్యభూషితాన్యేవ కేన చిద్భూషణాదినా, యేన భూషితవద్భాతి తద్రూపమితి కథ్యతే" "భూషణములు లేకున్నను భూషణములు ధరించినట్లు శరీర మందగించుట "రూప లక్షణము".

* అభిఖ్యానామశోభయోః" అమరము.

ద్వయము నాశ్రయించిన ద్వివిధానందము నొక్కసారిగ అఖండముగ ననుభవింపఁ గల్గుచున్నది." ఈ శ్లోకార్థమును, మును నేను భావించుచుండఁగా నొక వ్యంగ్యార్థమిట్లుభాసించినది. భావుకులీ విశేషార్థమును విలోకించెదరు గాక.

"భారతీయ కవితా కీర్తిలక్ష్మి యనఁదగిన సంస్కృత కవితా లక్ష్మి శోభాలక్ష్మికి నిత్య నిలయమైన యుమా ముఖలక్ష్మి వంటి కాళిదాస కవీంద్రుని కావ్యలక్ష్మిని ఆశ్రయించినదై ద్విసంశ్రయమైన, అనఁగా నాముష్మికయుతమైన యైహికానందమును అఖండముగ నొక్కసారిగ (నా సంస్కృత కవితాలక్ష్మి) పొందఁగల్గుచున్నది "ఐహికముతో నాముష్మికము కలిసినపుడే అట్టిది అఖండానందదమై, మన కవీశ్వరుని కావ్యలక్ష్మి వలె బ్రహ్మానందదాయక మగుచుండునని యీ వ్యంగ్యార్థములోని భావము. ఇట్టి భావములు పరిణత భావభాసురులకే పరిగ్రాహ్యము లగుచుండు నేమో ?

పై విధముగ మన కవీశ్వరుఁడు పార్వతీదేవి రూపమును మనోజ్ఞముగను, మహితముగను వర్ణించి (యితఁడు) తద్రూపమును సౌందర్య శేవధిగ*

"సర్వోపమాద్రవ్య సముచ్చయేన యథాప్రదేశం వినివేశితేన,
సానిర్మితా విశ్వసృజాప్రయత్నా దేకస్థ సౌందర్య దిదృక్షయేవ.
(1-49)

'చంద్రారవిందాద్యుపమాన వస్తుగతకాంతి సౌకుమార్యాది సౌందర్యద్రవ్యమంతటని సంతరించి, యథావసరముగ దీని నుపయోగించుచు బ్రహ్మ పార్వతీదేవిని అందాలరాసిగా, కేవల సౌందర్యద్రవ్య స్వరూపిణిగఁ బ్రయత్నముతో నిర్మించినాఁడఁట. ఇంతటి యపూర్వ, నూతన నిర్మాణమునకుఁ గారణము బ్రహ్మకు "ఏకత్ర సౌందర్య దిదృక్ష"యేఁ;

* నిధిర్నా శేవధిః (చూ. అమరము 1-71)

ప్రపంచములోఁగల "సౌందర్య" మునంతను నొక్కచోఁజూచుకోరిక యే. ఇట్టికోరిక బ్రహ్మకు లేనిచో నిట్టి యపూర్వనిర్మాణప్రయత్న మెందు లకుఁ బ్రాదుర్భవించును ?

ఇట్టి గిరిజ • గిరీశుని సపర్యకై గిరిరాజుచే నియుక్తయై యొక నాఁడు గిరీశుని సన్నిధికి వచ్చుచున్నది. అప్పటి యామె రూపమును జూచి రతీదేవికూడ సిగ్గుచెందుచున్నది. (3-57) ఇట్టి రత్యధిక రూప ముతో వనదేవతలు చెలులై తనవెంట రాఁగా నా పర్వతరాజకన్య అకాల వసంత శోభలతో మునులనుగూడ మోహపెట్టుచున్న వసంత విజృంభణములతో వెలయు స్థాణ్వాశ్రమములోనికి వచ్చుచున్నది. అప్పటి యామె సహజసౌందర్యము మన కాళిదాసకవీంద్రుని కవితా సౌందర్యముచేమఱింత వన్నెకెక్కి మహితముగనిట్లు భాసించుచున్నది.

"ఆవర్జితా కించిదివ స్తనాభ్యాం వాసోవసానా తరుణార్కరాగం
పర్యాప్తపుష్ప స్తబకావనమ్రా సంచారిణీ పల్లవితాల తేవ (3-54)

"నగరాజపుత్రి పయోధరములగౌరవముచే నీషన్నమిత(వంగినది)యై బాలసూర్యునిరాగమువంటి రంగుకల వస్త్రమునుధరించి యా చంద్ర శేఖరుని సమీపమునకు వచ్చుచుండఁగా, నిండు పూగుత్తుల బరువుచే వంగి, చిగురుటాకులతోఁ గూడి, నడచి వచ్చుచున్న లతవలె నా రా కన్నియ, లలితసుందర సుకుమార గాత్రియై కానవచ్చెను." ఆ హిమ గిరికన్య వచ్చుచున్నప్పు డింకను నెల్లుండె ననఁగా, "సంయమి యగు నీశ్వరునిఁ జూచుటతోడనే భయముచేఁ బెమర్చిన తన చేతినుండి య ప్రయత్నముగఁ జాపమునుజార్చిన మన్మథుని సన్నగిలిన సాహసమును దిరిగి గిరిజ తన సమ్మోహనరూపములో ఎగసనద్రోయుచుఁ జెలికత్తె యలతోఁగూడివచ్చుచున్నది" (3-52) ఇట్లు గిరిజాకన్య రాకను, మన కవిచంద్రుఁడు శ్లోకపంచకముతో నైదు విధములుగ విస్మయకర విలాస విభవములచే వయ్యారముగ వర్ణించినాఁడు చూడుఁడు.

---

• "గిరీశో గిరిశో మృడః" (చూ. అమరములో దేవవర్గము)

"ఈ హిమవత్పుత్రి పొగడపూల మాలను మొలనూలుగా ధరించి వచ్చుచుండఁగా నా మేఖల, మాటిమాటికి మొలనుండి జాఱుచున్నది. జాఱుచున్న మేఖల యెట్లుండె ననఁగా, మన్మథుఁడు మున్ముం దుపయోగించుకొనుటకై దాఁచుకొనుట కుత్తమ స్థానమైన యీ గిరిజా నితంబ స్థానమున రెండవ నారిత్రాడువలె నున్నది. (పొగడదండ) ఇట్టి యీ కేసరదామకాంచిని గిరిజ పదేపదే పైకిఁ బట్టుకొనుచు వచ్చుచున్నది."

(చూ. 3-55)

గిరిజా కళ్యాణానంతరమునఁ బునర్జీవితుఁడై మన్మథుఁడు తిరిగి ఈగిరిజా సాధనముచే (ఈ నారిచే) మదనారిని మోహపెట్టి కోపము దీర్చుకొన్నాఁడు కదా! కనుక మన్మథుని ద్వితీయ మౌర్వివలె నీ గిరిజా నితంబ స్థితమగు కేసరదామ కాంచి, విశ్వమోహన కరముగఁ గరము ప్రకాశించుట సహజము.

మఱియుఁ "బద్మినీజాతికిఁ జెందిన యీ గిరిరాజకన్య, వామదేవునివైపు వచ్చుచున్నపుడు ఈమె సౌగంధికనిశ్వాసమును జవిగొన్న యొక తుమ్మెద, ఆమె నిశ్వాసము పద్మపరిమళ మనుకొని యామె యధర సమీపమునఁ దిరుగుచున్నది. అప్పుడా లోలాక్షి భయసంభ్రమములతో 'లోలాక్షి' యగుచుఁ దన చేతిలోని లీలారవిందముచే నా తుమ్మెదను నివారించుచు వచ్చుచున్నది"

(చూ. కు. సం. సర్గ 3 శ్లో. 56)

ఇట్లు సంయమీంద్రుఁడగు సర్వేశ్వరునిఁగూడ మోహపెట్టఁగల్గినంతటి సమ్మోహన రూపముతో వికారకారులగు విలాస వైభవములతో మదజనక మగుచున్న ప్రకృతి ప్రాభవముతో పరిభావితయై యాగిరిరాజకన్య వచ్చి, యా సంయమీంద్రుని సమీపించి, కిసలయ ఖండ మిశ్రితమైన వాసంతపుష్ప ప్రకరమును దత్పాదమూలమునఁ జల్లి, తన నల్లని కురులలో జాలువారుచున్న నవకర్ణికార పుష్పమును

జూర్చుచుఁ గర్ణాలంకారముగ ధరించిన చిగురుటాకుజాఱునట్లు తనశిరము వంచి యా మోహనగాత్రి యా సంయమికి మ్రొక్కెను. ఈ సుముహూర్తసమయమున సుమాస్త్రుఁడు సవిరాపించి, తత్సమ్మోహనరూపమును నస్త్రమోహకరణముగఁ జేసికొని సాహసముతో నా సర్వేశ్వరునిపైఁ దన సమ్మోహన బాణమును బ్రయోగించెను. ఈ సరస సన్నివేశ ద్వయ సమ్మేళన శక్తిచే నా జితేంద్రియుని ధైర్యము, చంద్రోదయ సమయమున సముద్రమువలెఁ గొంచెము చలించినది. తోడనే మహేశుఁడు పర్వతరాజకన్య యధరమువైపు సాభిలాషముగఁ జూచినాఁడు. మహేశునిలోఁ గల్గిన ఈ సరస భావోదయము శర్వాణిలో శృంగార చేష్టితముల నుద్గమింపఁజేసి, చంద్రశేఖరుని ముఖమువైపు తన్ముఖమును ద్రిప్పించినది. విరూపాక్షుని చిత్తములో వికారముదయించినది.

ఇట్టి వికార హేతువున కింతవఱకుఁ దెలియనిది. అకాండ జనితమగు నిట్టి వికారమును దనలో నడంచికొని యీశుఁడు రుద్రుఁడై వికారకారకుఁడైన యా మదనుని, భస్మావశేషునిఁ జేసి యచటువీడి యంతర్ధానము పొందెను. ఇంతటితోఁ దృతీయసర్గాంతమగును.

సమ్మోహన బాణముంబోలిన పార్వతీ సమ్మోహనరూప మిట శర్వునిచిత్తమును గొంచెము మెత్తన చేయునంతవఱకే యుపయోగించినది. కనుక వికారకారకమైన సమ్మోహన బాణముతోపాటు వికారజనకమైన పార్వతీ సమ్మోహనరూపము కూడ వమ్మైపోయినది. గిరిజ శూన్యచిత్తయై గిరిరాజ గృహముఁ జేరుకొన్నది.

(ఇది పూర్వభాగము)

భారతీయ వివాహ సంప్రదాయములోఁ గన్యాదాత,

"ధర్మేచ, అర్థేచ, కామేచ, త్వయైషానాఽతి చరితవ్యా"

"ఈ వధువుతోఁగూడి నీవు ధర్మార్థకామములను సమదృష్టితో సేవించ

పలయును" అని వరుని కుపదేశించును. ఆవరుఁడపుడు 'నాఁతిచరామి' అని కన్యాదాతకు వాగ్దానము చేయును. ఈ సూత్రార్థమునే యీ క్రింది సూక్త్యర్థ మిట్లు స్పష్టము చేయుచున్నది.

"ధర్మార్థకామాః స్సమమేవ సేవ్యాః
యోహ్యేకసక్త స్సజనో జఘన్యః"

కనుక మన వైవాహిక సంప్రదాయానుసారముగాఁ గేవల కామపురుషార్థ సేవనము నింద్యమైనది. ఇట్టి తృతీయ పురుషార్థమునే ప్రస్తుతమునఁ బ్రధానముగఁ దోఁపించుచుఁ దన వినిర్మల చిత్తమును వికారాస్పదముగఁ జేసిన మన్మథుని మన్నింపక, మనకవీశ్వరుఁ డీశ్వరునితోఁ గలిసి భస్మముచేసి, మదనసహకారియైన పార్వతి సమ్మోహన రూపమును, విశ్వైక సౌందర్య సర్వస్వమును, మోమాటము లేక తిరస్క-రించి,త్యజించి, భారతీయ పవిత్రప్రణయ ప్రభావము నిటఁబ్రకటింపఁ దలఁచినాఁడు.

"ధర్మార్థ కామ మోక్షములు" అను మన పురుషార్థ చతుష్టయములో "ధర్మము" • మొదటిది. కనుక భారతీయ సంప్రదాయ రీత్యా "ధర్మము"న కగ్రస్థానము లభించినది. అనఁగా భారతీయునికి సర్వప్రథమముగ స్వమతధర్మ మవశ్యాఁనుష్ఠేయ మగుచున్నది. తుదకు మనకు స్వధర్మములో నిధనముకూడ శ్రేయస్కరమే. •కనుక భారతీయుఁ డైనవానికి "ధర్మము" ప్రాణతుల్యమే కాక ప్రాణాధికమగుచున్నదని స్పష్టమగుచున్నది. ఈ "ధర్మ"సూక్ష్మమును బాగుగ నెఱింగినవాఁడు కనుకనే యీ కాళిదాసు మాయావటు ముఖమునఁ దపోనిష్ఠలోనున్న పార్వతినిగూర్చి యిట్లు పలికించినాఁడు.

• "ధ్రియత ఇతి ధర్మః" దేని శక్తిచే నిరాధారమగు భూమండలము నిలువ గల్గుచున్నదో అదే ధర్మము.

• "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మా త్స్వనుష్ఠితాత్" గీత.

"అనేనధర్మస్సవిశేషమద్యమే త్రివర్గసారః ప్రతిభాతి భామిని!
త్వయా మనో నిర్విషయార్థ కామయా యదేకఏవ ప్రతిగృహ్యసేవ్యతే.
(5-38)

'ఓ గిరిజా! నీ విపు డర్థ కామములయం దాసక్తి విడనాడి, ఒక్క "ధర్మమునే" ఇంతగా నారాధించుచుండుటచే ధర్మమే "త్రివర్గములో సారము కలదని నేను (కపట వటువు) తలంచెదను.

కనుక, భారతీయ పవిత్ర ప్రణయ జీవితపుష్ప మాల్యము "ధర్మే చార్థేచ కామేచ త్వయైషా నాఽతి చరితవ్యా" అను సూత్రముచే సుసంగ్రథితమై సుబద్ధమై యున్నది. దీనిచే "అర్థ కామములు ధర్మానుస్యూతము లైనపుడే మానవానందమందఁజేసి సార్థకము లగుచున్నవను భావమును బై సూత్రము ధ్వనింపఁజేయుచున్నది. ఈ గృహ్యసూత్రార్థమునే కాళిదాస కవీంద్రుఁ డిట వివరింపఁదలచి, కామపురుషార్థమునే, జఘన్యమైన దానినే, జనింపఁజేయుచున్న ప్రస్తుత గిరిజా సౌందర్యమును నిరహంకారముగను ధర్మయుతముగను నిర్మలముగను సంస్కరింపఁ దలఁచి మోహాపరవశతనుండి నాయికా నాయకులను తాత్కాలికముగ వేఱుచేసినాఁడు

"సత్యము"నకు స్థానము లేనిచోట "శివ"మునకును స్థానము లభించదు. ఈ సత్యము, శివము లేనినాఁడు "సుందరము" సున్న. కనుక సత్యము, శివము కలిసి "సుందరము" తో సమ్మేళనము చెందినపుడే అట్టిది "భారతీయ సౌందర్య" ముగఁ బరిణమించును. ఇట్టి పరిణామమంతయుఁ దపస్సుచేతనే సాధ్యమగును. ఈ పరమార్థమును బట్టి గిరిజా రూపమును సత్య సౌందర్య సంయుతముగ సరిదిద్దఁదలఁచి మహాకవి యిట గిరిజచే సౌందర్యగర్వితచేఁ దపస్సుచేయించుటకు నిశ్చయించినాఁడు కనుక గౌరియుఁ దండ్రి యనుమతితో

"ఇయేష సాకర్తు మవంధ్యరూపతాం సమాధిమాస్థాయ తపోభిరాత్మన

అవాప్యతేవాకథ మన్యథాద్వయం తథావిధం ప్రేమపతిశ్చ తాదృశః.
(5-2)

"ఉమాదేవి తన మొదటి నిరుపమ సౌందర్య రూపమును దపో నియమములచే నిపుడు "అవంధ్య" రూపముగా సంస్కరింప సమకట్టినది. ఇట్లీమె తన రూపము "నవంధ్య" ముగ సంస్కరించనిచో నీశ్వరుని యర్ధాంగము నాహరించు నంతటి పవిత్ర సుస్థిర ప్రేమ ప్రాప్తియు, అఖండ సౌభాగ్యసంధాతయగు మృత్యుంజయుఁ డంతటివాఁడు పతిగాఁ బ్రాప్తించుటయు అను నీ యభ్యుదయద్వయ మీ శర్వాణి కెట్లు చేకూఱఁగలదు ?

ఇటగమనింపఁదగిన విషయమిది. గిరిజతపోనియమములతో "నవంధ్య" రూపమును సంపాదింప సమకట్టినదికదా ! కాఁగా నింతకుఁబూర్వ మందుఁగల యీమె యంద మంతయు విధాతకుఁగూడ వినోదమును గల్గింపఁజాలినంత కమనీయరూప మంతయు "వంధ్య" మైనట్లు వ్యక్త మగుచున్నది. కనుక నే యిట్టి వంధ్య రూపముతో శివుని చిత్తమును జూఱఁగొనలేక త్యక్తయై, "పతి చిత్తము చూఱఁగొనలేని యతివ యందము అందమేకాదని తన యప్పటి "వంధ్య" రూపమును దానే నిందించుకొన్నది (5-1)

ఇప్పటి యీమె సౌందర్యములో "సత్యత" లేకపోవుటచేతనే యీమె శివుని వశీకరించుకొనలేక పోయినది. కనుక నిపు డా లోటు దీర్చుకొనుటకై యీ గిరిజ తపశ్చరణమునకుఁ గడంగవలసివచ్చినది. కాఁగా దపశ్చరణము "సత్యసౌందర్య సంపాదక" మని స్పష్టమైనది. ఇట్లనుట కింకొక నిదర్శనముగూడ లేకపోలేదు. చూడుఁడు

"ఏతావతా నన్వనుమేయ శోభి కాంచీగుణస్థాన మనిందితాయాః
ఆరోపితం యద్గిరిశేన పశ్చాదనన్య నారీకమనీయ మంకం. (1-37)

"జితేంద్రియుఁడైన శివుఁడు అన్యస్త్రీలకు లభ్యముకాని తన తొడపై

పార్వతీ దేవిని ఆమె తపశ్చర ణానంతరమందే అధిష్ఠింపఁ జేసికొనినాఁ డన్నచో నామె నితంబబింబము తపస్సంస్కృత సౌందర్యసంయుతమై జితేంద్రియుని చిత్తమును గూడ రంజింపఁజేయు నంతటి శోభ కలదని, తత్కాంతి యూహింపఁదగిన దేగాని వర్ణింపఁదరము కానిదని, దానిచే "తపశ్శక్తి" యెంతటి దుష్కరకార్యములైనను సుకరముగాఁ జేయునని స్పష్టమగుచున్నది. కనుకనే

"యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరం
తత్సర్వం తపసాప్రాప్యం తపోహి దురతి క్రమం.

"ఏ వస్తువు మానవునకు దుస్సాధ్యము, దుర్లభము, దుర్గమము నగు చుండునో అదేవస్తువు తపశ్శక్తిచే సుసాధ్యము, సులభము, సుగమము నగుచుండును. మనకు మన మహర్షులచే నొసంగఁబడిన 'మూలశక్తి' ఈ తపశ్శక్తియే. ఈ ప్రత్యేక శక్తియే భారతీయుల "ప్రత్యేకతకు" ప్రధాన కారణము. ఇదియ వీరి మూలధనము. భారతీయులు తర తరాలవఱకుఁ బుష్కలముగ వాడుకొన్నను దఱుఁగని, తెలియని వారి యీమూలధనమే "తపోధనము". ఇదియ వీరికంగరక్ష. ఇదియ వీరి యిహపర సౌఖ్యమునకు మూలము. ఇదియ వీరి ప్రపంచప్రశస్తిలోఁ గల రహస్యము. ఈ రహస్యమును మన కాళిదాసకవీంద్రుఁడు సంపూర్ణముగఁ దెలిసినవాఁడు కనుకనే గౌరీదేవిచే మహాతపస్సు నాచరింపఁజేసి• తదాచరణానంతరమున నామెను బరమపావనమూర్తిగను, తపఃప్రభావ భాసిత దివ్యసౌందర్య సమలంకృత గను, వినిర్మల తేజో విరాజితగను బరిణమింపఁ జేసినాఁడు కనుకనే యీ పావనగాత్రి కారణమున పర్వతరాజు సాన్వయముగఁ బవిత్రీకృతుఁ డైనాఁడు (చూ. 5-35) ఇప్పటి యీ మెరూపము పదార్వన్నె బంగారము వలెఁ బ్రవిమల ప్రభాప్రదీప్తమై, కమనీయ కాంతిగంభీరమై సత్యసౌందర్యముచే స్వయంప్రభాసమాన మగుచున్నది. సాక్షా దీశ్వ

---

• "మహో తపస్సాక్ష్య ఇవస్థితాః తపాః (చూ. కు. సం. 5 సర్గ)

రుఁడే- అప్పటి యా కందర్పదర్ప దాహకుఁడే ఇప్పు డీమె చెంతకు మాయావటువై స్వయముగ వచ్చి ప్రసంగవశమున నామె యాంతరంగిక విశుద్ధికి వివశుఁడై యామె సచ్ఛీలమున కిట్లు సంతసించును.

“యదుచ్యతే పార్వతి! పాపవృత్తయే న రూపమిత్య వ్యభిచారి తద్వచః
తథాహి తే శీల ముదారదర్శనే తపస్వినామప్యుప దేశతాం గతం.
(5-36)

“సుగుణసజ్జితమైనసురూపము పాపప్రవృత్తులకుఁ గారణము కానేరదు” అనుసూక్తి, ఓ గిరిరాజపుత్రీ! నీవిషయమున నెంతయు నిజమైయున్నది సౌందర్యశేవధివైన నీయొక్క సద్వర్తనము ప్రస్తుతమున మహర్షులకుఁ గూడ మార్గదర్శకమై కీర్తింపఁబడుచున్నది.”

మన మహాకవి పై శ్లోకార్థముచే ‘యత్రాకృతి స్తత్ర గుణాః’ అనుసూక్త్యర్థమును సువ్యక్తముచేసినాఁడు. ‘భార్యారూపవతీ శత్రుః’ అను సామాన్యశాస్త్ర మిట కాళిదాస కవీంద్రుని యొక్క పై విశేష శాస్త్రముచే బాధితమగుచున్నది. ఇప్పటి పార్వతీరూపము తపశ్చరణాత్పూర్వమువంటిది గాక, యిపుడు శాంతగుణ సజ్జితమై, నిర్మల తేజస్సంభరితమై, సత్యశోభా సముల్లసితమై, యాధ్యాత్మిక తేజో విరాజమానమై యమ్మాయావటుని మానసమునకు సంతోషకారణమైనది. కాఁగా సత్ప్రవర్తనము, సచ్ఛీలము, ముఖ్యముగఁ దపశ్చరణము అనునివి లౌకిక సౌందర్యమునకు, బంగరునకుఁ బరిమళమువలె నపూర్వ శోభను బ్రసాదించునని ప్రస్ఫుటమైనది.

పై విధముగఁ దపశ్చరణానంతరమునఁ బార్వతీరూపము పరమేశ్వరుని నేత్ర చకోరములకుఁ జంద్రికయై, తన్మానసమున రాజహంసమై రాణించినది. అమ్మాయావటు వీఁక సఫలమనోరథుఁ డయ్యెను. వీని తపశ్చరణముగూడ నిందులకై యుద్దిష్టము కావచ్చునని మన మనుకొన్నదే కదా! అనుకొన్నదే యైనది. ఇక మాయారూప మెందులకు

కనుక ఆ మ్మాయావటువే మహేశుఁడై య మ్మగువచెంత నిలిచి యిట్లనును.

"అద్య ప్రభృత్యవనతాంగి తవాస్మి దాసః క్రీత స్తపోభిరితి వాదిని చంద్రమౌళౌ — — "(మా. కు.సం పంచమసర్గాంతము)

"ఓ సుందరాంగీ! నేఁడు మొదలు చేసికొని నేను నీకు దాసుఁడనైతిని. కారణ మేమనఁగా, నీవు నీ తపోధనములు వెచ్చించి నన్ను నిక్క ముగ నీవానినిగఁ జేసికొంటివి" అని యాచంద్రశేఖరుఁడు తన ప్రణయ చంద్రికా సమ్మిశ్రితమైన, శేఖరీకృత చంద్ర చంద్రికతో నా శర్వాణి యొక్క బాహ్యాభ్యంతర పరితాపములను బాపి యామె యంతరంగము నానందభరితముఁ జేసెను

ఇంతటితో గౌరీతపస్సు పరిపూర్ణముగ ఫలించినది. ఇట్లుమా మహేశ్వరు లిండ్రూరులతపస్సులకును ఒండొరులు ఫలరూపములుగఁ బరిణమించినారు.

శ్రీ కాళిదాసుమహాకవి ధర్మమాయని యానాఁటి గౌరీతపస్సు ఈనాఁ టికిని భారతీయకన్యకాజనము పాలిటి కల్పతరువై, నూత్న వధూవరుల భావిసౌభాగ్య జీవితమునకును, జీవిత సౌభాగ్యమునకును అంకురా ర్పణ మగుచున్నది. ఈ గౌరీతపస్సుతో పాటు మనకాళిదాసకవీశ్వరుని "సౌందర్య సమారాధనము" గూడ "సత్యం" పదభాజ మానమై, గౌరీకళ్యాణ మహోత్సవముతో, లోక "శివం" కరమై, సర్వాంగ "సుందరం" అను సూక్తికిఁ జక్కని నిదర్శనమై సముద్దీపించినది. కను కనే యీ గౌరీశంకరులు "పరస్పర తపస్సంపత్ఫలాయిత పరస్పరు"లై "ప్రపంచ మాతాపితరు"లై యిట్లే ప్రపంచ మాంగళ్యమున కాది దంపతు లైనారు. దీనితో భారతీయ ప్రణయము పవిత్ర శక్తిభాసు రమై జగన్మాంగళ్యమునకు మంగళతోరణమైనది.

ఇఁక పై శ్లోకములో వ్యంగ్య మర్యాదచే విశేషార్థ మొకటి విని

పించుచున్నది. ఈయర్థము ,,సౌందర్య''వర్ణనములో కాళిదాస కవీశ్వరునికిఁ గల ప్రత్యేక దృష్టిని, పరమార్థ దృష్టిని ప్రత్యక్షముగఁ బ్రకాశింపఁ జేయుచు నీ కవీంద్రుఁడు ,,సౌందర్యమును'' సర్వాంగ సుందరముగా నారాధించి ధన్యుఁడైన రీతి నిట స్పష్టము సేయుచున్నది. ఇపుడీకవీశ్వరుఁడు, తపఃప్రభావ భాసురసౌందర్య భాసిత యగు శర్వాణీ రూపములో సౌందర్యాధి దేవత * యగు సాక్షాజ్జగజ్జననీ రూపమును (కాళీ రూపమును) సందర్శించి యిట్లు తన జన్మమును ధన్యమొనర్చుకొనుచున్నాఁడు, దర్శించుఁడు.

,,అనవతాంగి= సౌందర్య భారేణ అవనతాన్యంగాని యస్యాః, అతః హే సౌందర్య రూపిణీ •; హే కాళి ! అస్మి=అహం; A తవ=కాళీ రూపాయాః తవ; దాసః=అర్థాత్కాలి దాసోహం;'' అని స్వనామధేయోచ్చారణ పూర్వకముగ B పార్వతీరూపములో నున్న కాళీమా

* గిరిజ సౌందర్యాధిదేవత యనుటకు శ్రీ ఆదిశంకరుల యీ సౌందర్యలహరీ స్తుతియే చక్కనినిదర్శనము.

,,హరిస్త్వామారాధ్య ప్రణతజన సౌభాగ్య జననీం
పురానారీభూత్వా పురరిపు మపిక్షోభ మనయత్
స్మరోపిత్వాం నత్వా రతినయన లేహ్యేనవపుషా
మునీనామప్యంతః ప్రభవతిహి మోహాయ జగతాం. (5-శ్లో)

,,ఓ శర్వాణీ! పూర్వము శ్రీహరినిన్నారాధించుటచేతనే జగన్మోహినీరూపము దాల్చి మహేశునిఁగూడ మోహపెట్టఁగలిగినాఁడు. ఇట్లే మన్మథుఁడు, జననీ! సౌందర్యనిధివైన నిన్ను సేవించుటచేతనే రతీనేత్ర పర్వమైన తన సమ్మోహన రూపముతో మునులనుగూడ మోహపెట్టుచు, జనతయొక్క చిత్తములను జిందరవందర చేయుచున్నాడు.

• ,,త్వదీయం సౌందర్యం తుహిన గిరికన్యే తులయితుం కవీంద్రాః కల్పంతే కథమపి విరించి ప్రభృతయః. — — '' (చూ. సౌందర్యలహరి)

ఎ. అస్మిత్య హమర్థే ,,అవ్యయం''ఉదాహరణః- ,,పాదప్రహార ఇతి సుందరి ! నావస్మిదూయే'' ఓ సుందరాంగీ ! నీ చేసినపనికి నేను చింతింపను.

బి "తతోభివాదయే ద్వృద్ధాననసావహమితి బ్రువన్'' (గృహ్యసూత్రవివృతి) దేవతలకుకూడ తమపే రుచ్చరించి నమస్కరించుట శిష్ట సంప్రదాయము.

తకుఁ దన యారాధ్య దేవతకీ కాళిదాసు వ్యంగ్య మర్యాదచే నంజలి ఘటించి, తన నామధేయముతోపాటు తనజీవితమునుగూడ కావ్యను గ్రహపాత్రముగఁ జేసి, (యీ సౌందర్యారాధనతో సహా) ధన్యము చేసికొనిన ట్లిచ్చట నాకు గోచరించినది. కాళిదాసు శాకుంతల భరత వాక్యములోఁ గోరిన పునర్జన్మ రాహిత్యకాంక్ష, పై నిగల నాభావము నంగీకరించు ననుకొందును. ఇది సహృదయ సంగ్రాహ్యము.

ఇంతవఱకుఁగల నా యాశయసంతతి నాదరించుచు, వానిని వివరించి విస్పష్టము సేయుచున్న ట్లున్న శ్రీ అరవింద యోగీంద్రుల యమృతాయమానమాన్య భావములఁగొన్నిటి నిటఁ బాఠకుల కందించు చుంటిని. పార్వతీదేవి యొక్క మొదటి భౌతిక సౌందర్య సర్వస్వము శక్తిరహితమై, ఈశ్వర తిరస్కృతము కాఁగా నదే తప స్స్వాశీల్యాదుల సంసర్గముచే శక్తియుతమై పరమేశ్వర పరిగృహీతమైన క్రమపరిణామ రీతిని పై యోగీంద్రుల వాక్యములు వ్యక్తము సేయుచున్నవి.

(శ్రీ అరవిందయోగీంద్రుల యాంగ్లమాతృకకు శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము, ఎం. ఏ. గారి యాంధ్రానువాదమే యీ క్రిందిది.)

"పార్వతీ సౌందర్యము లోకాతీతము. దానిని కవి తన యసాధారణ శిల్ప సామర్థ్యముతో నుత్తమ చిత్రకారునివలెఁ జిత్రించినాఁడు. పార్వతి యాసమయమున నొక యుత్తమ ప్రబంధనాయికయే యైనది. తానట్టి సౌందర్యవతి నని గిరిరాజసుతకుఁ గూడఁ దెలియును. యావన మీ యహంకారమునకుఁ గరావలంబన మొసంగినది. ఈ స్థితిలో నామె శివుని వశీకృతునిఁ గావించుకొనుటకై శుశ్రూషయొనర్చినది. ఆమెకు మన్మథుఁడు, మన్మథున కీమెయు, నిరువురకు మాధవుఁడును సాయ పడి విఫలులైనారు. భౌతికశక్తి ఆత్మశక్తి నెప్పటికిని జయింపలే దను నాధ్యాత్మికరహస్యమిందు (కాళిదాసుచే) కావ్యమార్గమునఁ (కాంతా సమ్మితముగ) బ్రబోధింపఁ బడినది.

అహంకారము రజోగుణలక్షణము. ఈరజోగుణ మడంగినఁగాని సత్త్వోద్రేకమున కవకాశము లేదు. సత్త్వోద్రేకమునఁ గాని శివ వశీకరణము సాధ్యముకాదు. ఈవిధముగా నామెకు (ముందు) సాధనసంశుద్ధి లేదు. ముందుగా శారీరక సౌందర్యాహంకార మణఁగవలయును. అప్పుడామెయందలి రజోగుణమణఁగును పిమ్మటఁదప మొనరించినచో సత్త్వ ముద్రేకించును. నైష్ఠిక సౌందర్యజ్యోతి వెలుఁగొందును. అప్పుడామె తనకుఁ బరిగ్రహణ యోగ్యుఁడగునని యెంచి యౌవనాహంకార కారకుఁడైన మన్మథుని భస్మమొనర్చి శివుఁ డంత ర్హితుఁడయ్యెను.

మన్మథ నిర్మథనముతో పార్వతి యౌవనాహంకార మంతరించెను. శివుఁ డరూపహార్యుఁడనియు ♦ అతనిని సాధించుటకుఁ దనసుందరశరీర సంపద నిరర్థకమనియు (నామె) సమర్థించుకొన్నది. దుర్లభుఁ డైన శివుని సమాగమమునకు మార్గాంతరముగానక తపోదీక్ష వహించినది. ముందు సర్వసమత్వమును అలవరచుకొన్నది. వృక్ష లతాదు లందు, కురంగ శాబకములందు వాత్సల్యము నెఱపినది. శీతోష్ణాది ద్వంద్వము లందు సమ భావము సాధించినది. ఈ విధముగా పార్వతి (ప్రకృతి రూపిణి) ప్రకృతితో నభేదమునొందినది. ఇఁక పురుషునితో (శివునితో) నొందవలసియున్నది. (కనుక) నిత్యాభియుక్తురాలై A యనన్య చిత్తముతో శివునిఁ బర్యుపాసించి యాకర్షించినది. అతని యగ్ని పరీక్షలో నెగ్గి

♦ భవుడు కేవలభౌతిక సౌందర్యమునకు వశుఁడుకాడు!

A "తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం" గీత

బి సత్యదేవి యహంకారము అగ్నిచే శాంతించినది. ఆమెయవలౌ రమేమైన యీపార్వతి యహంకారముకూడ శాంతించుట కగ్నిసంబంధ మవసరమా? అన్నట్లిట కాళిదాసు అగ్నిపరీక్ష కల్పించియుండనోపు.

హరుని సైవసము గావించుకొన్నది. శారీరకముగాఁగూడ నద్వైతసిద్ధి (అర్ధనారీశ్వర రూపము) నంది లోకారాధ్య మైనది.

పార్వతీ సౌందర్యము ప్రణయము నందును, ప్రణయము పరిణాయ మందును, పరిణయము కుమార ప్రభవము నందును సార్థకత నొందెను. శివుని వశీకృతునిఁ గావించుకొనుటతో నామె ప్రేమ తనివి సనలేదు. అతని మెప్పించి శరీరార్ధము నాచికొన్నఁగాని (ఆమె) కృత కృత్యత భావింపలేదు. జగత్పితకు భార్యయై జగదుద్ధారకుఁ డగు కుమారస్వామిని బ్రసాదించి జగన్మాతృగౌరవమందుకొన్నది. ఇందలి ప్రేమపరిణామము, పాతివ్రత్యసమ్మేళనవిధానము, భారతీయప్రణయరహస్య గోపనము భావించుకొలంది భావింపఁజేయును. ఆనందించుకొలఁది నానందింపఁ జేయును.

"పరస్పర తపస్సంప త్ఫలాయిత పరస్పరౌ
ప్రపంచ మాతాపితరౌ ప్రాంచౌ జాయాపతీ స్తుమః"

## —•శాకుంతల శకుంతల•—

శ్రీ కాళిదాస కవీంద్రుని శకుంతలా సౌందర్య సర్వస్వమును సందర్శించుటకు ముందు మనము గిరిజా సౌందర్యముతో శకుంతలా సౌందర్యమునకుఁగల సామ్యములను దెలియుట మంచిది.

పార్వతీదేవి జన్మచేతనే పవిత్రురా లైనది. హిమవంతుఁ డీమె జన్మచే, మందాకినీ నదిచే స్వర్గమువలెఁ బవిత్రుఁడై విభూషితుఁ డయ్యెను. (చూ. కు.సం. 1-28) ఇట్టి యీమె బాల్యక్రీడలు కూడ పవిత్ర "మందాకినీ సైకతవేదికల"లోఁగడచినవి. (చూ.కు.సం. 1-29)

ఇట్లీమె బాల్యజీవిత మంతయు హైమవత దివ్య భూములలోఁ గడచినది. ఇఁక నీమె యౌవనవయస్సు పవిత్రస్థాణ్వాశ్రమములోఁదప మొనరించెడు పరమేశ్వరుని పరిచర్యతోఁగడచినది.(చూ.కు.సం.1-60)

ఇఁక శకుంతలయు జన్మచే నప్సరస్సంభవ;A మహర్షి తనూజ; కనుక అప్సరస్సు యొక్క దివ్య సౌందర్య వైభవము, మహాముని మహిత తేజము ననునవి యీమెలో మేళనమందినవి. ఈమె బాల్య జీవిత మంతయు "కులపతి" కణ్వర్షి తపోవనములోఁ గడచినది. ఆ వాతావరణమంతయుఁ బ్రశాంతతతోఁ బరిపూర్ణము,పరిపూతము నైనది. నిజమునకా కణ్వాశ్రమము "శాంతినికేత" మనవలెను. ఆ తపోవన మంతయు నిత్యమును యజ్ఞయాగాదిక్రతువుల పవిత్రాజ్యాహుతి గంధములతోఁ బరిమళించుచుండును. B ఇట్టి ప్రశాంతపవిత్రతపోవనములోఁ బెరుఁగుచున్న శకుంతలకు, ఆమె చెలికత్తియలతో పాటు అచ్చటి ముగ్ధ మృగములు, పరోపకారైక జీవనముగల పాదపములు, లతలు, పక్షులు మొదలగునవి ప్రేమపాత్రములైనవి. శకుంతల వృక్షములకు ముందు జలములిడి పిమ్మటనే తాను త్రాగును. లతలకు నొప్పికలుగు నని వాని కిసలయమైనను దుంపదు. C గిరిజయుఁదన తపశ్చర ణావసరమునఁనచ్చటి వృక్షకములను ఘటస్తన ప్రస్రవణములతోఁ బెంచి వాని యందుఁ బుత్రవాత్సల్యము నెఱపినది (చూ. కు.సం. 5-14) ఇట్లిరువు

ఎ "సురయువతి సంభవం కిలమునేరపత్యం తదుజ్ఝితాధిగతం..." చూ. శాకుంతలం అంకం)

బి ఈమహాకవి కావ్యతపోవనము లాయా క్రతువుల యాహుతి గంధములతోఁ బరిమళించుచునే యుండును "...భిన్నోరాగఃకిసలయ రుచామాజ్యధూమోద్గమేన ..." (చూ. శాకుంతలం అంకం) "......పునానం పవనోద్ధూతైర్ధూమైరాహుతి గంధిభిః" రఘువంశ కావ్యం సర్గ)

సి (చూ. శాకుంతలం 4 అంకం శ్లో. 8,13,14, అంకం 'అస్తిమ మాపిసోదరస్నేహ ఏతేషుతరుషు"

రుఁను దమలోని విశాలవిశ్వప్రేమ మున్నందు విశ్వజనీనమై విరాజిలు నట్లు బాల్యముననే తమ ప్రేమామృతమును జరాచర ప్రకృతితో నొలికించి, ఒకరు జగన్మాతగను మఱొకరు భరతమాతగను రాఁబోవు పవిత్రపరిణతి నిప్పుడే తమపవిమలపవిత్రనమునఁ బ్రకటించినారు D.

ఇఁక వీరిలో నాశ్రమవిరుద్ధమైన వికారమునకుఁ గారకులు, అటు భావజుఁడు, ఇటు భావజరూపుఁడు దుష్యంతుఁడు. ఈ భావజులరాకయే ముగ్ధలగు పార్వతీ శకుంతలల శృంగార భావ సాగరములకు నిజముగ 'రాక'యే (16కళలతోడి చంద్రుఁడుకల పౌర్ణమి) యైనది. కాఁగా నిఁక వీరి యిప్పటి యౌవనోద్రిక్తతతోఁ గూడిన సరస భావవాహిని గట్లు త్రెంచుకొని పొంగి పొరలుచుండెను. అశాశ్వత మగు నిట్టి యౌవనోద్దామతనుండి యుదయించిన ప్రేమ గూడ నశాశ్వతముగనే యుండును. ఇట్టి ప్రేమ భారతీయ సంస్కృతికి విరుద్ధమైనది. ఇంతియే కాక మన కాళిదాస కవి తన సౌందర్య వర్ణనమును సచ్చిదానందాత్మక మగు దివ్యప్రణయము నందే పర్యవసింపఁ జేయుచుండు నను విషయమును పార్వతీసౌందర్యోత్తరభాగములోఁ గన్గొని యుంటిమి. కనుక నిట నవయౌవనాహంకార దోషదూషితమైన వీరి ప్రేమను నిరాకరింపఁ దలఁచినట్లు మన కవీశ్వరుఁడు, అట పార్వతికి ముక్కంటి కంటిమంటలను, ఇట శకుంతలకు అగ్నివంటి దుర్వాసుని దుర్భర శాపమును గల్పించినాఁడు. అహంకార నిష్కాసన సమర్థములైన యీ సన్నివేశ (ద్వయ) ప్రయోగబలముచే వీరి యౌవనాహంకారకల్మిష మంతరించినది. ఇఁక వీరికిఁజిత్త నైర్మల్యసిద్ధి కలుగుటకై వీరిచే మనకవి తపస్సు చేయించినాఁడు. దీనితో వీరి శీలాదులు పదార్వన్నె బంగారమువలె వినిర్మలములై విశిష్ట తేజోవిరాజమానములైనవి. ఇట్టి వీరి నైర్మల్యము

D (కుమా. కు. సం॥ సర్గ 5. శ్లో 14,15,.)

వీరి సౌందర్యమునకుఁ బవిత్రశక్తిమత్త్వమును, దివ్యకాంతిమత్త్వమును బ్రసాదించినది. ఇఁక వీరులతపమొనరించినప్రదేశములుకూడ గౌరీశంకరశిఖర దివ్యభూములు, శాశ్వతానందనిలయమైన మారీచమహర్షి దివ్యాశ్రమ స్వర్గభూములు. ఇచ్చటి దివ్యవాతావరణముకూడ వీరి జీవితములను దివ్యభావ భాసితములుగఁ జేయుటలోఁ బరమోపకారకములైనవి.

పై విధముగ మన కవీంద్రుఁడు తన కావ్యనాయికల సౌందర్య సముద్ధతిని గ్రమముగఁ బరిణామ భాసురముగ దిద్దితీర్చి ఆ నాయికలు విశ్వప్రేమ విరాజిత విశుద్ధమానసలుగఁ బరిణతి గాంచిన పిమ్మటనే వారిని నాయకులతోఁ జేర్చి 'మాతృత్వ' పదముతోను, 'జగన్మాతృత్వ' పదముతోను వారి జన్మలను ధన్యమొనర్చినాఁడు.

ప్రస్తుతమున, భౌతికమై యస్థిరమైన శకుంతలాసౌందర్యమును నిత్యమై, యాధ్యాత్మిక తేజస్సందీప్తముగఁ బరిణమింపఁ జేసిన మన కాళిదాసకవీంద్రుని సౌందర్యపరిణామక్రమ రీతి అతి నిపుణమై, సహజ సుందరసుకుమార సులలిత సుమనోహరమునై యున్నది. ఈ విషయ జాత మంతయు విస్పష్టమగుటకై జర్మన్ మహాకవియైన 'గథే' మహాశయునియొక్క యొక చిన్న యాంగ్లగీతమును శాకుంతల కథామంజరీ సౌరభవిశేషములను ఖండఖండాంతరములలో వెదఁజల్లిన దానినిటఁ గైకొందును.

క్రొత్త పరువములో నున్న పువ్వుము క్రమ పరిణతితో ఫలమైనట్లు, శకుంతలయొక్క భౌతిక సౌందర్యము క్రమ వికాసముతో ఆధ్యాత్మిక సౌందర్యముగఁ బరిణతిఁ జెందిన క్రమము నీ పద్యము తెలుపును.

(Sakuntala Its inner meaning)
"Would'st thou the young year's blossoms
and the fruits of its decline,
And all by which the soul is charmed

enraptured, feasted, fed.
Would'st thou the Earth and Heaven
itself in one sole name combine ?
I name thee, O Sakuntala ! and
all at once is said'' (''Goethe'' ''గేథ'')

సీ॥ "నవవికాసములతో నభిరూప సుమములు
పరిణతి నెద్దాన ఫలతఁ గాంచు
ఆత్మ మెద్దానిచే నాకర్షితంబయి
సంతోషభరితమై సంభ్రమించు
సకలేంద్రియగ్రామ సంతృప్తిఁ బడయుచు
నాత్మ మెద్దాన నానందమయము
భూతలం బెద్దాని పోడిమితోఁ గూడి
స్వర్గధామంబుగా సౌఖ్యద మగు

తే॥ భౌతికము నేదిత్రుటిలో నభౌతికముగఁ
జేయఁజాలును నట్టిది, సెప్పుడనిన
కువలయంబున నొక్క "శకుంతల" యని
"ఓశకుంతల" నిన్ను నే నుచ్చరింతు"

(అనుసరణ—రచయిత)

పై 'గథే' పద్యమునకు "విశ్వకవి" శ్రీ రవీంద్రనాథ ఠాకూర్ మహాశయుని యాంగ్ల వివరణమే యీ క్రిందిది. ఈ వివరణము పై యాంగ్ల పద్యమునకు భాష్య మనఁదగి యున్నది.

'Goethe' the master poet of Europe, has summed up his criticism of Sakuntala in a single quatrain; he has not taken the poem to pieces. This seems to be a smll thing like the flame of a candle, but it lights up the whole drama in an instant, and reveals its inner nature.

In Goethe's words, Sakuntala blends together the young years blossoms and the fruits of maturity; it combines heaven and earth in one.

"యూరపు" ఖండ మహాకవియైన 'గెథే'A శాకుంతల నాటకమును గూర్చిన తన విమర్శను ఒక్క చిన్న పద్యములో అఖండముగ నిట్లు సంగ్రహించెను. పై పద్యము దీపకళికవలె మనకుఁ జన్నదిగ కనుపించుచున్నను, (ఇది) శాకుంతల నాటకమునంతను నొక్క క్షణములోఁ బ్రకాశింపఁజేసి, దాని యంతరార్థము నొక్కసారిగఁ బ్రస్ఫుటము సేయును.

"గెథే" మహాశయుఁ డనినట్లు వనయౌవన వికాస విలసితములగు పువ్వులు తమ పరిణామరూపములైన ఫలములతోఁ జెందిన సరససమ్మేళనమే "శాకుంతల నాటకము" మఱియు నీ నాటకము స్వర్భూలోకముల నొక్కచోటనతి సహజముగఁ గలుపఁగల్గిన పరంధామము.

ఈ నాటకము దివ్య కవితా సౌందర్య సందేశ సంభరిత మని మెంచి,"గెథే" ఆనంద పారవశ్యముతోఁ జేసిన కేవల తత్కవితావేశమే. 'ఈ పద్యము' అనుకొని మనము పై 'గెథె' ప్రశంసా పద్యమును జులకనగ భావింపవచ్చును. కాని మనభావన వాస్తవికముకాదు ఎందుకనిన, పై యాంగ్లపద్యము 'గెథే' మహాకవి కేవల ఆనంద పారవశ్యముతోఁ జెప్పినదికాదు. ఇఁక ఆపద్యము కాళిదాసకవీంద్రుని కవితాతత్త్వ నిర్ణాయకమైన ఒక సాహిత్యవిమర్శకాగ్రేసరునియొక్క నిష్పాక్షికమైన, నిస్సంకోచమైన, న్యాయసమ్మత మగు తీర్పు.

కనుకనే 'గెథే'యొక్క పై సుభాషితములలోఁ బ్రత్యేకమగు సంశము (పరమార్థము లేక సత్యము) అంతర్లీనమైయున్నది. అదే మనఁగా పుష్పము ఫలముగను, భూతలము స్వర్గముగను, భౌతికము ఆధ్యాత్మికముగను పరిణామము చెందుట– వీని క్రమ పరిణామ చరిత్రయే 'శాకుంతల నాటక' మని 'గెథే' తన పద్యములో నొక్కి వక్కాణించినాడు. (సశేషము)

# కీర్తిశేషులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

సుప్రసిద్ధ దేశచరిత్రజ్ఞులు, ప్రాచీన లిపి, శాసనపరిశోధకులు నయి కొంతకాలమునుండి ఆంధ్ర విశ్వవిద్యాలయమున శాసన పరిశోధనాధ్యాపకులుగాఁ బనిచేయుచున్న వీరు తమ 72వ యేట విశాఖ పట్టణములో 6-1-63 రాత్రి లింగైక్యమయిన వార్తకు మా దురంత సంతాపమును బ్రకటించుచున్నాము. డిగ్రీలు, విశ్వవిద్యాలయ పట్టములు లేకయే, స్వయం కృషిచే నసాధారణ చారిత్రక పరిజ్ఞానము, పాండిత్యము సంపాదించి పట్టభద్రులకుఁ బట్టములు ప్రసాదింపఁ గలిగిన విద్యద్వరుణ్యులు వీరు. మల్లంపల్లి గ్రామము తెలంగాణములో పాలకురికి సోమనాథ మహాకవి జన్మస్థలమగు పాలకురికికి, బమ్మెర పోతనామాత్యుని జన్మస్థలమగు బమ్మెరకు సమీపమున నున్నది. అచ్చట నుండి పూర్వకాలముననే పశ్చిమ గోదావరీ మండలమునందలి నరసాపురము తాలూకా మినిమించిలిపాడు గ్రామమునకు వలసవచ్చి యచ్చట స్థిరపడిన శైవబ్రాహ్మణ కుటుంబమునందు శర్మగారు 1891 వత్సరమున జననమొందిరి. వీరి తండ్రి భద్రయ్యగారు పరమ శివభక్తులు. ప్రతి వత్సరము కార్తికమాసములో నియతముగ గణార్చన మొనర్చెడి వారు. శర్మగారికిఁ జిన్నతనము నుండియుఁ జారిత్రకాభిరుచి మెండు. రాజమండ్రిలో చిలకమర్తి లక్ష్మీనరసింహము గారి సంపాదకత్వమున వెలువడు దేశమాత పత్రికకు సహాయ సంపాదకులుగాఁ బనిచేసి, చరిత్ర చతురానన బిరుదాంచితులగు కీ॥ శే॥ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారికి ఆంధ్రుల చరిత్ర రచనమునందుఁ జేదోడు వాదోడుగాఁ బనిచేయుచుండిరి. ఆకాలముననే ఆంధ్రాభ్యుదయ గ్రంథమాలను స్థాపించి "ఆంధ్ర వీరులు"మున్నగు గ్రంథములు ప్రకటించిరి. శాసన లిపి పరిశోధన పరిజ్ఞానములో కీ॥ శే॥ కొమర్రాజు వేంకటలక్ష్మణరావు పంతులు,జయంతి రామయ్యపంతులు గారల యొద్ద శిక్షణమునొంది క్రమ క్రమముగ వానియందు సమగ్ర నైపుణ్యమును

సంపాదించిరి. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి యాధ్వర్య వమునఁ బ్రకటితమయిన ఆంధ్ర విజ్ఞానసర్వస్వ ప్రథమ సంపుట ప్రకటన విషయమున నాగేశ్వరరావు పంతులుగారికి, లక్ష్మణరావు గారికి సహాయులుగా నుండిరి. తరువాత మదరాసులో, తెలుఁగు భాషా సమితి వారు ప్రకటించిన విజ్ఞాన సర్వస్వ సంపుటములకుఁ బ్రధాన సంగ్రాహకులుగాఁ బనిచేసి వాని ప్రకాశమునకుఁ దోడ్పడిరి. ఆంధ్ర దేశ చరిత్రమునకు, బౌద్ధవాఙ్మయమునకు, సంబంధించిన చారిత్రిక వ్యాసములనేకములు చిరకాలమునుండి పలుపత్రికలలోఁ బ్రకటించుటయే గాక యనేక శాసనములను 'భారతి'మున్నగు పత్రికలలోఁ దమ విపుల పీఠికలతోఁ బ్రకటించియున్నారు. ఆంధ్రమున, ఆంధ్ర దేశ చరిత్ర సంగ్రహము, అమరావతీ స్తూపము, రోహిణీ చంద్రగుప్త (నవల)మున్నగు నుత్తమ గ్రంథములను, ఆంగ్లమున History of the Reddy Kingdoms (ఆంధ్ర విశ్వవిద్యాలయముచేఁ బ్రకటితము). Forgotten chapter of the Andhra country అను గ్రంథములను రచించిరి. వీరు ప్రకటించిన సారస్వత, చారిత్రక వ్యాసములసంఖ్యాకములు. అముద్రితములయిన వీరి గ్రంథములను, వ్యాసములను సత్వరముగ వెలువరించుటకు విశ్వవిద్యాలయములు సారస్వత సంస్థలు శ్రద్ధవహింపవలసియున్నది. వీరి యమోఘ కృషి కలరి కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు "ఆంధ్ర ప్రశస్తి" యను తమ కృతిని వీరికే యంకిత మొనరించి యున్నారు. వీరి నిర్యాణము వలన నాంధ్ర చారిత్రక లోకమునకుఁ దీఱని నష్టము వాటిల్లినదని చెప్పనక్కఱ లేదు. నిజనామాంకితులయి తన యందైక్యమయిన శర్మగారి యాత్మకు శాశ్వతానంద సౌఖ్యములఁ బ్రసాదింప సోమశేఖరునిఁ బ్రార్థించుచు వారి కుటుంబమునకు మాసానుభూతిని నివేదించు చున్నారము.

---

# పరిషత్పత్రిక సం. 51 సంచిక 1-2 లోని గ్రంథసమీక్షకుఁ గొన్ని సవరణలు.

పయిపత్రికలో "గ్రంథస్వీకారము-సమీక్ష" అను శీర్షికక్రింద పరిషత్కార్యాలయమునకు వచ్చిన కొన్ని గ్రంథముల పయి నేను సమీక్ష ప్రకటించియున్నాను. అందులో 85-86 పుటలలో కాకినాడ వాస్తవ్యులు రిటైర్డు ఇంజనీయరు, శ్రీ తాళ్ళూరి భాస్కరనారాయణమూర్తిగారు రచించిన "దుష్టసర్ప శతకము" పయి సమీక్ష గలదు. దీనిపయి గ్రంథకర్త శ్రీ భాస్కరనారాయణమూర్తిగారు ఆగ్రహావిష్టులయి పత్రికాసంపాదకుల పేర ది 6-1-63వ తేదీని ఒక రిజిష్టర్డునోటీసు (తిరుగు రసీదుతో) నిచ్చుటయే గాక మరల 10-1-63వ తేదీని మఱియొక యనుబంధలేఖను గూడ వారిపేర వ్రాసియున్నారు. వీనిలో ముఖ్యముగ వీరు గావించిన యారోపణములు.

(1) పద్యమకుటము "దుష్టసర్పమ! విడువుమా దురితబుద్ధి" అని గ్రంథములో నుండఁగా అది "దుష్టసర్పమ! విడువుమా దుష్టబుద్ధి" అని వేఱొక భిన్నార్థము ద్యోతకమగునట్లు సమీక్షలో నుదాహృతమయినదని,

(2) మచ్చునకయి యుదాహృతమయిన మూఁడు పద్యములలో-

"క్రూరచిత్త మసహనంబుఁ గుటిలబుద్ధిఁ
గలిగి జీవులఁబట్టి నిష్కారణముగ
ప్రాణములఁదీసి దుష్కీర్తిఁ బడసెదీవు"

అను 6వ పద్యము మొదటిపాదము తమకపయశముగలుగుటకయి వ్యతిరేకార్థము వచ్చునట్లు,

"క్రూరచిత్తము సహనంబుఁ గుటిల బుద్ధిఁ"

అని బుద్ధిపూర్వకకల్పనముతో మార్పుచేసి వ్యాకరణమునకు హత్య, భావమునకు హింస గావించితి నని,

గ్రంథకర్త వీనిని బ్రమాదములుగా గణింపక సమీక్షకుని బుద్ధిపూర్వక కల్పనములుగను నేరములుగను గ్రహించుట, తన ప్రజ్ఞావిశేషముచే నన్నొక హంతకునిగా నిరూపించుట శోచనీయము. పత్రికాప్రచురణము, ముద్రణము నొకరిచేతిమీఁద జరుగునవి కావనుట సర్వవిదితము. లేఖకుల యొక్కయు, ముద్రాపకుల యొక్కయు బహువిధప్రమాదము లందుదొరలుట సహజము. సహృదయులయిన పాఠకులు వానిని గుర్తించి సహనముతో సవరించుకొని వానిని సరిగాఁ జదువుకొనఁ గలరు. "క్రూరచిత్త మసహనంబుఁ గుటిలబుద్ధి" అను చోట 'చిత్త' తరువాత స్పేసు ఉంచకపోవుట, పయిఁగా మవర్ణము నందు ఉత్వముంచుట, కేవలము ముద్రాపకుల ప్రమాదములు. ఇవి ముద్రారాక్షసములు (Printer's Devils). ప్రూఫులు చూచుటలో వీనిని గుర్తించి సవరింపక పోవుటయుఁ బ్రమాదమే. శతక పద్యమకుటములో గ్రంథమున ముద్రితములయిన చివరిగణములు "దురిత బుద్ధి" అయి యుండఁగా నవి "దుష్టబుద్ధి" యని సమీక్షలో నుదాహృతము లగుటయుఁ బ్రమాదమే. సమీక్ష గావించిన నేను గాని ముద్రాపకులుగాని యీ మార్పులను బుద్ధిపూర్వకముగఁ జేసియుండ లేదనియు, అట్లు చేయుటవలన మాకట్టి ప్రయోజనము లేదనియుఁ గవిగారి కపయశము గలిగింపవలె ననెడు దుష్టబుద్ధి మాకెంత మాత్రము లేదనియు, సవినయముగ మనవిచేసి, దొరలిన యీ ప్రమాదములకు హృదయపూర్వకముగ మా పశ్చాత్తాపమును బ్రకటించుచున్నారము. రిజష్టర్డు నోటీసు మూలమున నీ ప్రమాదములను జూపినందుకు వారికి మా కృతజ్ఞతాభివందనములు. పాఠకు లీ సవరణలు గుర్తించి ౧వ పద్యము ప్రథమపాదము "క్రూరచిత్త మసహనంబుఁ గుటిలబుద్ధిఁ" అనియుఁ బద్యమకుటము "దుష్ట సర్పమ! విడువుమా దురితబుద్ధి" అనియు సరిగాఁ బఠింపఁ బ్రార్థితులు.

"ప్రమాదో ధీమతా మపి" "గచ్ఛతః స్ఖలనం క్వాపి" అని మన పెద్దల వ్యవహారము. వడిగనో నెమ్మదిగనో నడచువానికే ప్రమాదమునఁ బతనము గలుగనేర్చును. ఒక్కచోఁ గూర్చుండువాని కేదియు నుండదు. ధీమంతులగు కృతికర్తగారే తాము స్వహస్తమున లిఖించి పంపిన రిజిష్టర్డు నోటీసులోనే యెన్నియో లేఖక ప్రమాదములకు గుఱి యైనారు.

(1) 4, 5 పంక్తులలో "జ్యేష్ఠాషాఢ మాసములకు" అనుటకు 'జ్యేష్టాషాఢ మాసములకు' అని వ్రాసినారు.

(2) 8వ పంక్తిలో శతకనామమును పేర్కొనుటలో "నాచే రచింపఁబడిన "దుష్టశతకము యొక్క" అని వ్రాసినారు. 'సర్ప' అను మధ్యాక్షరములు రెండు నెగిరిపోయినవి.

(3) 10వ పంక్తిలో "గ్రంథస్వీకారము" అనుటకు "గ్రంథ స్వీరము" అని లిఖించినారు.

(4) 13వ పంక్తిలో "షష్టి"అనుటకు "షష్ఠి" అని వ్రాసినారు.

(5) 29 వ పంక్తిలో "యీ శతకమున కవతారిక వ్రాసి" అని వ్రాయుటలో "శతకము" అను పదమందలి ప్రథమ తృతీయాక్షరము లెగిరిపోయి "యీతమున కవతారిక వ్రాసి" అని లిఖించినారు.

ఇట్టి స్ఖాలిత్యము లింకనుగలవు. ఇవి మానవమాత్రుల కెల్ల సాజములే. వీనిని వీరు బుద్ధిపూర్వకముగఁ దప్పులుగానే లిఖించిరని యనఁ జాలము. కావున మాయెడఁ దాము చూపిన ప్రమాదములు గూడ నిట్టి స్ఖాలిత్యములేయని సహృదయులై గ్రహించి వారౌదార్యమును బ్రకటింతురు గాక యని విశ్వసింతుము.

మఱియుఁ దమయొక్కయు శతకమున కవతారిక లిఖించిన జొన్నలగడ్డ కృష్ణమూర్తి, ఎం. ఏ. గారి యొక్కయు వ్రాఁతలనుబట్టి

యూ శతకము సంపూర్ణముగ అన్యాపదేశముగ రచిత మయినట్లు గ్రహింపవలసి యుండఁగాఁ "కొన్ని పద్యములు కవి యుద్దేశించిన యన్యాపదేశ లక్షణమునకు సరిపడ" వని నే నభిప్రాయము ప్రకటించుట సరికాదని, అన్యాపదేశలక్షణ పరిచయము నాకుఁ దక్కువయి యుండవచ్చు నని తోఁచుచున్న దని కృతికర్తగారు తమ లేఖలో నీ విషయమై నా యజ్ఞానమును వ్యక్తీకరించినారు. అన్యాపదేశమున కుఁగలనయిన నలవడని నాకు శ్రీ నారాయణమూర్తిగారికి వలె నన్యాపదేశ లక్షణ పరిజ్ఞానము లేకుండుట వాస్తవమే. ఇందుఁగూర్చి నా యజ్ఞతను మనస్ఫూర్తిగ నంగీకరించుచు దానిని వెల్లడించిన శ్రీవారికిఁ గృతజ్ఞత ప్రకటించుచున్నాను.

రాహుకేతువులు సూర్యచంద్రులను సర్పరూపమున గ్రహణ సమయముల గ్రసించుట మున్నగు పౌరాణిక గాథలను జేర్కొనిన పద్యములు, సర్పకులాధిపతులగు శేష, వాసుకి, తక్షకాదులఁ జేర్కొనిన పద్యములు సంపూర్ణముగ అన్యాపదేశమునకు సరియైన లక్షణములు కానేరవని నేనభిప్రాయపడినమాట వాస్తవమే. కవిగారు తమ లేఖలోఁ గొన్ని కారణములు చెప్పి "అందువలన ప్రతిపద్యమునందును సంపూర్ణాన్యాపదేశ లక్షణ ముండుట కవకాశము లేదు." అని చెప్పుచుఁ, తక్షకాదులగూర్చిన 8౦వ పద్యమున అన్యాపదేశలక్షణము పైకిఁ గనిపింపకున్నను నిమిడి యున్నదని వ్రాసినారు. ఇట్లు కొన్ని పద్యములలో నన్యాపదేశము ప్రత్యక్షముగాఁ బ్రస్ఫుటముగాకున్నను వాని పూర్వోత్తర పద్యసందర్భములను బట్టి యవిగూడ అన్యాపదేశ పద్యములుగనే గణింపనవు నని వారు సెలవిచ్చిరి. వారి యుద్దేశ మదియే యైనచో దానిని కాదనుటకు నా కవసరము లేదు. ఈ శతక మందలి ప్రత్యక్షరము, ప్రతిశబ్దము, ప్రతి పద్యము అన్యాపదేశము లే యని సహృదయులగు పాఠకులు తలంచెడిచో నా కభ్యంతరము లేదు.

కుజనుల కన్యాపదేశములుగాఁ దగిలివచ్చునట్టు లిందలి పలు పద్యములు రచితమయిన మాట వాస్తవమని నేను మునుముందే సమీక్షయందు వ్రాసియుంటిని. తరువాత మొత్తముమీఁద నేను వెలువరించిన భావములకు దృష్టాంతముగాఁ జివరను 'మచ్చున కీపద్యములు చూడనగు' నని 6,28,83 మూఁడు పద్యములను ఉదాహరించితిని. కవిగారీవిషయమున నావ్రాఁతలను సరిగా నర్థముచేసికొనందుకు విచారించుచున్నాను.

ఇంతకుఁ బూర్వోక్తమయిన పరిషత్పత్త్రికలోఁ బ్రకటితమయిన ఈ శతక సమీక్ష నంతను సంపూర్ణముగ నే నుపసంహరించుకొనుచున్నాను. కావున నీశతక మాపత్త్రికయందు సమీక్షగావింపఁబడనట్లె పాఠకులు, కృతికర్త సంభావింతురుగాక యని మనవి చేయుచున్నాను.

బండారు తమ్మయ్య
పరిషదధ్యక్షుఁడు.

---

# గ్రంథస్వీకారము—సమీక్ష

(శ్రీ బండారు తమ్మయ్య)

(1) మహాపురుషుల బాల్య జీవితములు కొ౦ను పుటలు44 వెల 0-9.0

(2) విశ్వనాధశతకము కొ౦ను పుటలు 24 — —

(3) శ్రీ సాయిబాబా చరిత్రము (యక్షగానము) కొ౦ను పుటలు 33 0- 6-0

(4) వెన్నెల కుప్పలు-కొ౦ను పుటలు 42 0- 8-0

(5) బాలరామాయణశతకము కొ౦ను పుటలు 24 0- 4-0

(6) అహల్య (నాటకము) కొ౦ను పుటలు 78 0-12-0

కర్త:- శ్రీ విద్వాన్ ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యముగారు, ప్రధానాంధ్రోపధ్యాయులు కమిటీ హైస్కూలు చిలకలూరుపేట, గుంటూరు జిల్లా.

గ్రంథకర్త శ్రీ వేంకట సుబ్రహ్మణ్యముగారు చిలకలూరుపేట హైస్కూలులోనే ఆంధ్ర పండితులు శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారితోఁ గలిసి రచించిన కాంగ్రెసు విజయము, ప్రజారాజ్యము మున్నగు నాటకములపైని, మఱికొన్ని యితర కృతులు పయిని సమీక్ష యీపత్రిక పూర్వ సంచికలలోఁ గావింపఁబడినది. ఇప్పుడు పైని బేర్కొనిన గ్రంథములన్నియు శ్రీ వేంకట సుబ్రహ్మణ్యముగారు స్వయముగా రచించినవి. వీరు గ్రాంథిక భాషలో మృదు మధుర శైలిలో రచనలు సాగించుట కలవడిన యుత్తమ రచయిత.

(1) "అనుకరణము బాలబాలికల సహజ సహజాతము. అట్లగుట వారికి సద్గుణము లలవడఁ జేయవలయుననిన ఉదార మనుష్యుల జీవితచరితములందలి కొన్ని ఘట్టములను వారి కనులముందు చిత్రింపఁ జేయవలెను" అను సత్తమాశయముతో నేడు మహోన్నత కీర్తిమంతులయి వెలయుకొందఱు మహాపురుషుల బాల్య జీవితములందలి కొన్ని ఘట్టములను బురస్కరించికొని బాలుర యుపయోగమునకయి

యీ చిన్ని హొత్తమును రచించిరి. ఇందు విశ్వకవి రవీంద్రుడు, కందుకూరి వీరేశలింగము పంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహము, ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశము పంతులు, వేదము వేంకటరాయ శాస్త్రి, పింగళి వేంకటరామారెడ్డి, గూడపాటి హనుమంతరావు, సర్దారు వల్లభాయి పటేలు, పండిత జవహరులాలు, మహాత్మగాంధి మొత్తము పదిమంది మహాపురుషుల బాల్యజీవితమందలి చిన్న చిన్న కథ లిందు రచింపఁబడినవి. అందుఁ బ్రసక్తములయిన విషయముల కనుగుణముగ వానికి వరుసగ (1) ప్రకృతి పరిశీలన (2) తప్పువలని ముప్పు (3) పట్టుదల, (4) గురుశిష్యులు (5) అమితోత్సాహము (6) అంతయుభగవదిచ్ఛయే (7) విద్యాతృష్ణ (8) పిరికితనము పనికిరాదు (9) మంచి అనుకరణము (10) శీలసంపద అను శీర్షికలు గూర్పఁబడినవి. గ్రంథమంతయు బాలుర పఠనమునకు సముచితమయిన సులభశైలితో నొప్పుచున్నది వీరేశలింగము, చిలకమర్తి లక్ష్మీ నరసింహము, ప్రకాశము పంతు గారలకు సంబంధించిన చరిత్ర వారు వ్రాసిన గ్రంథముల నుండియే గయికొనఁబడినది. ఇట్టి గ్రంథములు బాలుర హృదయ సంస్కారమునకు కొంతయునుపకరించి మునుముందు వారి శీలములను జక్కదిద్దుటకు సహాయకములు కాఁగలవనుట నిస్సంశయము. 'ప్రతినెల'మున్నగు నవప్రయోగములు సంస్కరణావహములు.

(2) గుంటూరు జిల్లా ఖాజీపాలెమునందు వెలసిన విశ్వనాథస్వామి కంకితముగాఁ జేటగీతులలో రచింపఁబడిన 108 పద్యములిందుఁగలవు. ఇది కవిగారి ప్రథమరచనమని తెలియుచున్నది. చిన్నతనముననే బాగుగ వీరి కలవడిన భగవద్భక్తి కాదర్శముగనే యున్నది.

మచ్చునకు రెండు పద్యములు.

(1) కలఁడు కలఁడంచుఁ బిల్లలు పలుకుచుండఁ
గలిగి నింపైన భక్తి శ్రీకంఠ! నాకు

వంత కంతకుఁ దద్భక్తిఁ యధికమయ్యె
వినుతశీల! ఖాజీపుర విశ్వనాథ. (ప॥)

(2) సత్యమే నీవు మఱియేల సంశయంబు
నిత్యమౌ నెద్ది యద్దియే సత్యముగద
సత్యమవునగు నీవెపో జగతియందు
శాశ్వతుఁడవు ఖాజీపురి విశ్వనాథ. (ప 53)

(3) ..."బాలా" యనుమకుటముతో రామాయణ కథను సంగ్రహముగాఁ గవియిందు 108 కందపద్యములలో రచించుటం జేసి దీనికీపేరు పెట్టఁబడినట్లున్నది. అంతియేగాని సంస్కృతమందలి 'బాల రామాయణమున కిది యనువాదముకాదు. ; ఖాజీపాలెమందలి రఘు రామున కిదియంకితముగా రచితమయినట్లు శతకము 106 పద్యములోఁ జెప్పఁబడినది.

మచ్చునకు రెండు పద్యములు.

(1) ఎంగిలి పండుల నొకచోఁ । బొంగుచు శ్రీరామునకును బోలుపుగ భుజియిం । పంగను నిచ్చిన శబరికి రంగుగ (ప 59)
మోక్షం బొసంగె రాముఁడు బాలా!

(2) శ్రీరాముఁడు దోర్బలమునఁ గూర్చుండగు దాన నేంద్రుఁ గూల్చుటకొఱకై। కూర్చొ(?)మొండు విడువఁగఁ నారావణు తలలు గూలె నవనిని బాలా (ప 10)

(4) షిర్డీపురమునఁ గబీరుదాసు వంశమున వెలసి హిందూ మహమ్మదీయు లిరువురకు సమానముగ సంభావితుఁడయి యనేక మహిమలు చూపిన శాయిబాబా యను సిద్ధపురుషుని జీవితచరిత్ర మందలి కొన్ని లీలల సంగ్రహముగఁ గవి దీనిని హరికథారూపమున రచించియుండుట ముదావహము. తెనాలిలో సుందరరాం అండు సన్సు పేరితో గ్రంథ ప్రకాశకులుగా నుండిన శ్రీ ఊదర సుందరరామయ్య గారు దీని ప్రకాశకులు. అచ్చు తప్పు లెక్కువగానున్నవి. మచ్చున కొండు రెండు గేయములు, పద్యములు.

సర్వసమర్థుండగు శ్రీ శాయినాథుఁడని తెలిసి
ఫర్వాహి నహి యనినవ్వి పల్కె శిష్యతతినింగలిసి
ఉర్విని కొందఱు జనమ్ములుద్ధతులై తెలియలేరు
సర్వంబును తమదెయనుచు సాధులఁ గనఁగొనలేరు

ఉ॥ మానవ జాతికిన్ మతము మాన్యత: జేకుఱఁ జేయఁగావలెన్
గాని రవంతన్యూనతలను గల్పన సేయఁగరాదు సువ్వెయి! వైన మెఱిం
గి లేని మతవాదములంబడి కొట్టుకొందురే మానుఁడు భ్రాతృహత్యల
మానుమ కృత్యములవ్విధాత్రిలో

(5) వివిధ శీర్షికలతోఁ దామప్పుడప్పుడు రచించిన ఖండ కృతులఁ గొన్నిటిని జేర్చి కవి దీనిని "వెన్నెల కుప్పలు" "అను పేరితోఁ బ్రకటించిరి. (1) పుష్పాభిలాష (2) జయచంద్రానుతాపము (3) కోటప్పకొండ (4) పానకములోపుడక (5) దీనబంధు (6) చంద్రి (7) దేశభక్తుఁడు (8) గాంధిజీనీతి (9) కవి (10) విడ్డూరము (11) సుభాషిణి యను పదునొకండు శీర్షికలు గల పద్యములిందున్నవి. "దీనబంధు"అనునది శ్రీకామతాప్రసాద గురుగారి దీనిని హరోరా" కు అనువాదముగాఁ జెప్పఁబడినది. "విడ్డూరము" అనునది గాంధీమహాత్ముని దుర్మరణమునకు సంబంధించినది. పద్యములు చాలవఱకు మనోహర శైలితో నలరారుచున్నవి. మచ్చునకు మూఁడుముదాహరింతుము.

1 శా॥ మా సౌందర్యము, మాదు సౌరభము సన్మానంబు నుంభొంది! సు
శ్రీ సౌఖ్యావహమై యిహంబు పరముం జేర్పంగనౌఁ గాని సం
తోసం; బట్టులుగాని నాఁడు సుజన స్తోత్రంబు నుంగాంచునే
మా సామీ! దయయుంచు మమ్ములను జంపంబూన కిచ్చోటునన్

(పుష్పాభిలాష)

(2) అమలసుచరిత్రి నీదయ యపరిమితము
మఱివఁజాలవు దీనుల మఱవలేరు
పలువిధంబుల నీదయ పరగు కలప
ధనబలప్రభుత్వములు వ్యర్థంబులవని. (దీనబంధు)

చ॥ సుభగపు శయ్యాపాకమునఁ జొబ్బిలుచుండెడి గోస్తనీరుచుల్
శుభమగు వాక్ప్రసూనముల సొంపగు జాను దెనుంగు
తేటలన్
సభికులు మెచ్చఁగాఁ గవిత సల్పు సుధార సధారగల్గి శ్రీ

విభ నమెలర్చ సారపదవీ మృదుపీఠిణ పంక్తి తేలెడిన్ (7 కవి)
"నీమ యాజ్ఞ" మున్నగు వ్యాకరణ దోషములందందుఁ బ్రమాదవ
శమున దొరలినవి.

(6) రామాయణమునఁ గానవచ్చు అహల్యకథ ననుసరించియే స్వల్పపు మార్పులతోఁ గవి యీనాటకమును అయిదు అంకములుగా రచించినారు. కవిగారి భావమిఁది కరవది వాస్తవ్యులు ప్రతాప కృష్ణమూర్తి శాస్త్రిగారు సముచితముగ రచించిన విజ్ఞప్తి యిందుఁ జేర్పఁబడినది "ఈ నాటక కవి కీయహల్యయే ప్రారంభము. అయినను ఇందలి ముఖ్య విషయములు పరదారాభిమర్శన దూషణము, పాతివ్రత్య మహిమ, భగవత్పద సరోజరజఃకణ మాహాత్మ్యము, ఇవి ఔచిత్యానుసారముగా రసభరితములై పోషింపఁబడినవి" అను సభిప్రాయముతో మేమును నేకీభవించుచున్నాము పాత్రిసంభాషణములు హృద్యతరముగఁ బోషింపఁబడినవి. పద్యములు పరిమితముగనే రచింపఁబడి గద్యముననే రచనము చాలవఱకు నిర్వహింపఁబడుట సముచితముగ నున్నది.

ఇందలి పద్యము లొకటి రెండుదాహరించెదము.

గీ॥ దయను నిర్మూలనముఁ జేయఁ ధర్మమడఁచు
గాంతులను బెంచు మదియందుఁ గరుణడించు
నీతినియమంబు బడఁగించు భీతిఁ బెంచు
నట్టి సామ్రాజ్య సుఖముల కాసనేల

మ॥ తనదుర్వార పరాక్రమంబునను ధూర్తత్వంబుచేఁ గ్రిందు వీఁ
డును గర్వంబునఁ గానకే మొనఁడు బల్ దుర్మార్గముల్ సల్పువా
డు నరేంద్రుండయగున్ శచీంద్రుడగు మండుండౌచు బాపానలం
బునభస్మీకృత దేహుఁడై చనఁడె పోవో ధర్మముల్ హీనమై॥

"గర్వపోతు" మున్నగు దుష్టసమాసము లందందుఁ గానవగును అట్టివి సంస్కరణీయములు.

(7) శబ్దోత్పత్తి శతకము "ద్వితీయ భాగము"

క్రౌను పుటలు 20 వెల 0-8-0 కర్త :- శ్రీ విద్వాన్ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు తెలుఁగు పండితులు బోను హైస్కూలు గుడివాడ.

శ్రీ మల్లికార్జునరావుగారు బహు గ్రంథ కర్తలు. ఆంధ్రోపాధ్యాయులుగా విశేషానుభవము గడించిన వారు. వ్యాకరణాదిక భాషావిషయములను విద్యార్థులు, ఉపాధ్యాయులు ధారణ చేయుట కుపకరించు శతకముల నేకము లింతకుమున్ను రచించినవారు. ఆ శ్రేణిలోనిదే యీ శబ్దోత్పత్తి శతకము. దీని మొదటిభాగమిదివఱలోనే యీ పత్రికలో సమీక్ష గావింపఁబడినది. సహస్రావధాని, కవిరత్న శ్రీరాం వీరబ్రహ్మకవిగారి "పరిచయము", ఓంకారం గురురాజకవి, దిట్ట కవి రామకృష్ణయ్య, జి. జే. సామ్యుయేలు కవి రచించిన ప్రశంసా పూర్వక పద్యములు గూడ నిందు ముద్రితములయినవి. సత్తెన్నపల్లిలో

విద్యార్థినుల యుపయోగమునకయి హాస్టలు స్థాపించిన సంఘసేవా పరాయణ శ్రీమతి త్రిపురనేని సాధువమ్మగారి కిదియంకితమగుట ముదావహము. ప్రస్తుత కృతిలో 100 కం పద్యములున్నవి. మిగతి భాగములు శీఘ్రముగ వెలువడఁ గలవని యాశింతుము.

మచ్చునకుఁ గొన్ని పద్యములు.

(1) కుంభమునఁ బుట్టినందునఁ
గుంభజుఁడని చెప్పినారు. కోవిద వర్యుల్
జంభుని఼ఁ గూల్చెను గావున
జంభారియనుచుఁ బలికిరి శాబ్దికులు ధరన్ (ప 15)

(2) నిటలమున నక్షిగలుగఁగ
నిటలాక్షుండని పలికిరి నిశ్చలచిత్తుల్
పటమును గూర్చెకు వానిని
బటకారుం డనినొడివిరి. పండిత వర్యుల్ (ప64)

(3) పురములఁ గూల్చిన వానిని
బురహారుఁడని పల్కినారు బుధ జనవర్యుల్
పురిగల విహాగము గావునఁ
బురిపులుఁ గని చెప్పినారు. పురుషవరేణ్యుల్ (ప 90)

(8) ప్రసన్న రాఘవ నాట్యప్రబంధము :- కర్త బొడ్డుచెర్ల చిన తిమ్మయ్యకవి. సంపాదకులు శ్రీ బి. రామరాజు ఎం. ఏ. గారు రీడరు ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు ప్రకాశకులు ఆంధ్ర రచయితల సంఘము హైదరాబాదు డెమీ. పుటలు 222+40

వెల రు 6-0-0

ఇది సంస్కృతమున జయదేవకవి రచించిన యేడంకముల ప్రసన్న రాఘవ నాటకము ననుసరించి తెలుఁగున రచింపఁబడిన ప్రబంధము. కవి దీనికి నాట్యప్రబంధమని పేరిడుటలో నొక విశేషమున్నది.

అంతకుఁ బూర్వము కాళిదాసుని శాకుంతల నాటకమును, కృష్ణ మిశ్రుని ప్రబోధ చంద్రోదయ నాటకమును, పిల్లలమఱ్ఱి పిన వీరభద్ర కవి,నందిమల్లయ ఘంట సింగయకవులు నాసంస్కృత నాటకములందలి కథను మాత్రము గయికొని వానిని నాంద్రప్రబంధ మర్యాదల కను గుణముగా స్వతంత్ర ప్రబంధములుగ రచించియున్నారు. అంత కించుక పూర్వము వినుకొండ వల్లభరాయకవి రావిపాటి త్రిపురాంతకుఁడు సంస్కృతమున రచించిన ప్రేమాభిరామనాటకము ననుసరించి నాటకీయ ఫక్కియందలి నాంది, సూత్రధార సంభాషణము, పాత్ర సంభాషణ విధానము, ఆకాశ భాషితములు మున్నగు వానిని జాలవఱకుఁ బ్రతిపాదించుచుఁ గ్రీడాభిరామమను వీథి రూపకముగ నేకాశ్వాసముగ రచించియున్నాఁడు. ప్రస్తుత కృతి యింతకన్న విపులముగ మూలమందలియంక విభజనము నేపాటించుచు నేయంకమున కాయంక మేయందలి ప్రస్తావన, విష్కంభాదులఁ గూడఁ గ్రమముగ ననువదించుచు నొక నూత్న విధానమున రచింపఁబడిన ప్రబంధమయియున్నది. అందు చేతనే కవి దీనికి నాట్యప్రబంధమను విశేషణమును జేర్చినట్లున్నది. మూలనాటక కర్త జయదేవకవి గూడఁ దనకృతికి "నాట్యప్రబంధమతి మంజుల సంవిధానమ్" అను విశేషణము నుదాహరించినాఁడు. దాని ననుసరించియే యీ యాంధ్రకర్త గూడ నట్టి నామమునే గయికొని నట్లు తోఁచుచున్నది. ఈ ప్రబంధము విజయనగర రాజులలో నారవీటి బుక్కరాయల సంతతికిఁ జెందిన తిమ్మరాజున కంకితముగా రచింపఁబడినది.

ఈ తిమ్మరాజు పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయ ప్రబంధము నంకిత మొందిన నందేల కృష్ణరాజునకు సమకాలీనుఁడు, పినతాత మనుమఁడు నయియున్నాఁడు. కృష్ణరాజు, తిమ్మరాజు నన్నదమ్ముల మనుమలవుటచే వారు గూడ నన్నదమ్ముల వరుసవారే యగుదు

రనుట విస్పష్టము ఈ కృతిపతు లిరువురు క్రీ. శ. 1585-1600 ప్రాంత మున నంద్యాల, గండికోట ప్రాంత రాజ్యముల నేలిన వారగుటచే నీ ప్రబంధకర్త కూడ నాకాలము వాఁడే యగును. కవి తన నామము నీ ప్రబంధమున విస్పష్టముగఁ జేర్కొనకుండుట నీ కృతి కర్తృత్వ విష యము కొంత తర్కమునకుఁ దావలమగుచున్నది.

అందు శాకర మయిన పద్యము గ్రంథమం దిట్లున్నది.

"ధీరుఁడు బొడ్డుచెర్ల చినతిమ్మయ మంత్రి కుమారుఁడంచితా
కారుఁడు సత్కవి విదుఁడు కౌశిక గోత్రుఁడు పద్మనేత్రసే
వారత బుద్ధి నందవర వంశ్యుఁడు ప్రాకవి లోకనాథుఁడా
చార సమగ్ర రత్నుఁడు చారువచస్స్థితి నొప్పువాఁడొగిన్"

కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటు పద్యమణిమంజరి ప్రథమ భాగములో నీ పద్యము నొక సందర్భములో నుదాహరించుచు నిందలి ప్రాకవి లోకనాథుఁడను విశేషణమును సత్కవి లోకనాథుఁడని పేర్కొని నారఁట. కవి పాఠము ప్రాక్కవిలోకనాథుఁడయి యుండునని, ప్రాక్కవి శబ్దములో కకారమందలి ద్విత్వము తాళపత్రప్రతి లేఖకుని లేఖన ములో లోపించియుండవచ్చునని, "చిన తిమ్మయి" కవి తండ్రిపేరేగాని కవి పేరు గాదని వారి యభిప్రాయము. సంపాదకులు శ్రీ రామరాజు గారు బొడ్డుచెర్ల చిన తిమ్మయ, మంత్రికుమారుఁడు అను వానిని వ్యస్తసమాసములుగా గణించి, కవి నామము చినతిమ్మయ యని గ్రహింపఁగా, ఆంధ్రరచయితల సంఘాధ్యక్షులు శ్రీ ఆచార్య ఖండవిల్లి లక్ష్మీరంజనముగారీ గ్రంథమునకుఁ దామాంగ్లమున వ్రాసిన యవ తారికలో ప్రాకవి, లోకనాథుఁడు అను వానిని వ్యస్తపదములుగా గణించి కవినామము, లోకనాథుఁడయి యుండునని నిర్ణయించిరి. ఇం తకు నిట్లు కృతికర్త నామమిదమిత్థముగఁ దేలకుండుట శోచనీయము.

ఈ యాంధ్రీకృత నాట్య ప్రబంధము మూల కృతిననుసరించి దష్టాంకములుగనే రచితమయి ప్రత్యంకము చివర.

"నందేల తిమ్మరాజపు
రందర చిహ్న ప్రసన్న రాఘవ నాట్యా
మంద ప్రబంధరాజము
నందాఱవ యంకమయ్యె నార్య స్తుతమై" ఇత్యాదిగా నా యాంక సంఖ్య సూచిత మయినదిగాని వేఱే గద్యమేదియు రచింపఁబడలేదు. ఈ పద్యములలోఁ గూడఁ గృతి భర్త పేరే గాని కర్త పేరు చెప్పఁబడ లేదు.

ఈ గ్రంథమునకుఁ దాళపత్ర ప్రతి యొకటి మాత్రమే తెలంగాణములో లభ్యమయినట్లు సంపాదకులు తాము 27 పుటలలో ప్రరోచన నామకముగ రచించిన పీఠికలోఁ జెప్పియున్నారు. లభించిన దేకైక ప్రతియగుటను, అందును క్రిమిదష్టభాగము లెక్కువగా నుండుట చేతను, శ్రీ రామరాజుగారీ కావ్యమును బరిష్కరించి ముద్రించుటలో విశేషశ్రమమునకు లోనయినారని చెప్పనక్కఱ లేదు. అందుకయి యాంధ్ర విద్వల్లోకము వారికి సర్వదా కృతజ్ఞతాబద్ధము కాఁగలదు.

ఈ గ్రంథ రచన మానాఁటి యితర ప్రబంధములవలెనే ప్రౌఢతరముగనే సాగినది మూలకృతికర్త జయదేవునకుఁ బీయూషవర్షుఁడను సార్థక ప్రశస్తికలదు. అతనికవితలాలిత్యసౌకుమార్యములకుఁ దానక మయినది. ఆంధ్రీకృతిలో మూలమందలి మార్దవము గనరాదు. ఇది యోజోగుణ ప్రధానముగనున్నది. కొన్ని కొన్ని తావులఁ గవియ మూలశ్లోకములతో గ్రంథమును గూడఁ బెంచినాఁడు అట్టి వానిని శ్రీ రామరాజుగారు ప్రరోచనములోఁ బ్రదర్శించియే యున్నారు. ఇందలి తెలుఁగు పదములు కొన్ని నిఘంటువుల లెక్కనివి. అట్టి వానిని జాలవఱకు సంపాదకు లుదాహరించినారు. క్రిమిదష్టములయిన భాగములకు సంపాదకులు గావించిన పూరణములు కుండలీకరణములలోఁ జూపఁబడినవి. ఆంధ్రవాఙ్మయమున కమూల్యాలంకారముగ

నియలభ్యకృతిని, ఆంధ్రరచయితల సంఘము వారు తమ యాధ్వర్య వమునఁ బ్రకటించుట ప్రశంసనీయము. ప్రబంధశైలి తెలియుటకయి కొన్ని పద్యముల నుదాహరించెదము.

ఉ॥ భావము పల్లవింపఁగ శుభక్రియ చూపిరి శక్తి లేదు సం
భావన చేసి రజ్జనులు పాణిఘటింపరు ముష్టిముద్రయి
స్సీ! వదనంబె వంచిరిదె సిగ్గతి భర్గుని విల్లువంపరీ
భూవరసూను లెల్లమగ పుట్టువఁ బుట్టరొ పోరిలు ముట్టరో (1-206)

ఉ॥ కాకరఖండువంటి కనకంబును బోలెడు వాఁడు ముద్దు పెం
గూకటివాఁడు సోగనిడు గోపల చూపుల వాఁడు పించపుఁ
జీకటిమ్రాని కొంజివురు చెర్వన పీతుల వాఁడు కంతు పే
బాకలి మాన్పు వాఁడు చెలు వా! చెలువొందెదు వానిఁ జూచితే

మ॥ హరబాణాసనకైత వాద్రివర గూఢానేక గంభీరగ
హ్వరబంహిష్ఠరవ ప్రతిధ్వనులు వెన్నాడంగ పార్శ్వభవ
చ్చిర నాగాసన జాతవాక్య రచిత శ్రీరాము కీర్తి స్తుతుల్
బెరయం దిక్కులు నిండెఁ జండగుణ వల్లీ ప్రోల్లసద్ఘోషముల్
(3-151)

మ॥ నివుడెన్నింగిని దానిశాచర వధూ నిర్మాథ సన్మాంత్రికు
ల్దివసాంతాగత సుప్తి పంకజ వనాళీ బోధ వైతాళికుల్
సవికాసాంబుజ కోరకోదర కుటీ సంభూత భృంగాంగనా
రవరాగ ప్రణవోపదేశ గురువుల్ రాజీవమిత్రాంశువుల్ (7-210)

గ్రంథ పరిష్కరణమున శ్రీరామరాజుగారు రేఫద్వయ విషయమున విభేదము పాటించినట్లు గానరాదు. శకటరేఫాన్వితములగు పదములు లఘు రేఫములతోనే ముద్రింపఁబడినవి. నేఁటి ముద్రణములలోనివి పాటింప నక్కఱలేదనియే వారుతలంచిరి కాఁబోలు. అర్థానుస్వారములు పూర్తిగ విడనాడకపోయినను వానివిషయమునఁగూడఁ దగిన శ్రద్ధ చూపలేదు. గ్రంథమున నందందుఁ గొన్ని దోషములు సంస్కరింపఁబడక నిలిచిపోయినట్లే యున్నది.

మచ్చునకు

సీ॥ శాంతమతియైన యీసుమిత్రాత్మజూ
మానసేందిరం బిరంబు లక్ష్మణునకుం బలె
శ్రీమదఖిలైక పావన నామరామ
చరణ సరసీరుహంబున మరగి తిరుగు (1-123)

ఇందు మొదటి పాదమున యతిభంగము- "శాంతమతి" యను చోఁగవి పాఠము "శాతమతి" యైయుండునా ?

(9) చైనాదౌష్ట్యం కొన్ని పుటలు 14 వెల 0-4-0 } కర్త శ్రీ చొల్లేటి
(10) లక్షణాముకురము ,, 18 వెల 0-4-0 } నరసింహ
శర్మగారు రిటైర్డు తెలుఁగుపండితులు హనుమకొండ వరంగలుజిల్లా

(9) నేఁడు చైనావారు మనదేశముపయి గావించిన దురాక్రమణమును నిరసించుచు వివిధములయిన పద్యములు. వ్యాసములు పత్రికలందుఁ బ్రకటితములగుచున్నవి. కవులు, రచయితలు నిందు గూర్చి చిన్ని పొత్తములు గూడఁ బ్రకటించుచున్నారు. ప్రభుత్వము వారు గూడ నట్టి రచనలు గావించి ప్రజలలో నుత్సాహము, దేశభక్తిని రేకెత్తింపవలయునని హెచ్చరించుచున్నారు.

శ్రీ నృసింహశర్మగారు సమయోచితము లయిన రచనలు గూర్చుటయందు నైపుణ్యము ననుభవము గలవారు. తదనుగుణము గనే చైనా దౌష్ట్యమును గూర్చి పై చిన్ని పొత్తము గూర్చినారు ఇందులో (1) చైనాకు మనము చేసిన మేలు (2) (అది) మనకు చేసిన కీడు (3) నీపాపాంతము (4) నాయక్ రబిలాల్ థాపా (సాహస పరాక్రమములు) (5) మన వీర సైనికుల పురాణగాథ (6) శ్మశానభిత్తిక (చైనా ప్రాతిగోడ నిర్మితికి సంబంధించినది) అను వచన రచనలు చైనా దౌష్ట్యం, నేర్చుకో, చందమామ, అను మూఁడు గేయములు కలవు. దీని పఠనము పాఠకులలో చైనా గావించిన మోసము నెడరోసము గలిగించి వారిలో దేశభక్తిని రేకెత్తించుననుటలో సందియము లేదు. అందఱు నవశ్యము పఠింపఁదగినది. గేయములలోని కొన్ని పాదములు.

శిక్షణాలయపు బాలవీరులా
రక్షణ నిధికై యీ క్షణమందే
దక్షిణ గూర్చి పంపించంగా
దీక్షఁ బూనితిమి నశించుఁ గాత

చైనా శాత్రవం చైనా శాత్రవం

చలువ జల్లులు చల్లు నలుపు మేఘాలు
ఏడురంగుల సీను ఇంద్రచాపాలు
ముత్యాలు వెదజల్లుమునుసుబిందువులు
ప్రత్యూషమున లేపు పక్షిరాజములు
పాఠాలు చెప్పఁగా పఠియించు తండ్రి
వల్లించి దేశము వన్నెదిద్దుమురా !

నెల నెలకు నాలుపోగు చందమామ
తలకొక్కటిచ్చుకొందుము చందమామ
చందమామ చందమామ నీ
నందాలమామ వోయి చందమామ

(10) పరీక్షలకుఁ జదువు పాఠశాలా కళాశాలా విద్యార్థులకు ఛందస్సు, వ్యాకరణము, అలంకారము, నాటకీయ నిర్వచనములు, పరిభాషలు మున్నగు ముఖ్యాంశములు సంగ్రహముగఁ దెలిసికొని ధారణ చేసికొనుట కనువగు పద్యములిందుఁ గలవు. విద్యార్థులకిది కొంగు బంగారము వంటిది. అవశ్య మాదరణీయము. గ్రంథనామ మన్వర్థకముగానున్నది. పద్యముల క్రింద వచనములో వివరణములు, ఉదాహరణములు కూడ నున్నవి. "కొండ గుర్తులు చూపి కైలాసానికి దారిచూపిరి" "సూక్ష్మములో మోక్షము చూపినారు" ఇత్యాదిగాఁ బండితులు గావించిన ప్రశంసలు కూడ నుదాహృతములయినవి.

# వ్యక్తివివేకము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

ఇచట 'వవౌ' అను క్రియాస్వరూపము స్పష్టముగ భాసింపదు.

ఈ విషయము న్యాయసిద్ధమే యైనను మృదుమతులగువారికి సుఖప్రతిపత్తి కలుగుటకొఱకై వచనమునందు ప్రతిపాదితమైనది.

పై విషయము నిందు సంగ్రహముగ నిరూపించుచున్నాము.

తగిన నిబంధన మున్నపుడు, పదమున కంతయు నావృత్తిని సేయవలయును. పదాంశమున కెప్పుడును నావృత్తిని చేయరాదు. (90)

పదావృత్తికున్న యుపయోగము, పదాంశావృత్తికి నుండదు. పదాంశావృత్తిని చేయుదుమేని, యింతకుఁ బూర్వము, పదమునకున్న యర్థము తిరోభూత మగును (91)

ఒక పదమును ప్రయోగించుటచేతనే, రెండర్థములును స్ఫురించుచో, నపుడు పద, తదంశములకు రెంటికిని నొకేపర్యాయ మర్థబోధ కలుగును. అపుడు కవులు స్వేచ్ఛగ శ్లేష నుపయోగింపవచ్చును. (స్వరూపహరణము మాత్రము పనికిరాదని భావము)

"యత్ర చ మాతంగగామిన్యః శీలవత్యశ్చ, గౌర్యో విభవరతాశ్చ, శ్యామాః పద్మ రాగిణ్యశ్చ, ధవలద్విజశుచి వదనాః మదిరామోదనిశ్వాసితాశ్చ ప్రమదాః"

ఇందు విరోధాభాసాలంకార మున్నది.

అర్థము:—ఎచట స్త్రీలు- మాతంగగామినులు=చండాల గామినులు, శీలవత్యశ్చ=పతివ్రతలును (ఏనుఁగులవలె నడచువారు అను నర్థమున విరోధపరిహారము) గౌర్యః=శివునిభార్యలు, వి, భవ, రతాశ్చ=శివేతరునియం దనురక్తికలవారు (గౌర్యః=తెల్లనివారు, విభవములయం దాసక్తి కలవారు) శ్యామాః=నల్లనివారు; పద్మరాగిణ్యశ్చ=ఎఱ్ఱని

వారు (శ్యామాః=పదునాఱు సంవత్సరముల వయస్సుకలవారు, పద్మరాగమణులు కలవారు) ధవల ద్విజశుచివదనాః=స్వచ్ఛమైనబ్రాహ్మణునివలె, పవిత్రమైనముఖముగలవారు, కల్లువాసనలతోనున్న శ్వాసవాయువులు గలవారును, (తెల్లని దంతములచే పవిత్రమైన నోరుగలవారు)

ఇందు విరోధము, చ శబ్దావేదితము. అపి శబ్దమువలె, చ శబ్దమునకుఁగూడ విరోధాభిధానసామర్థ్యము గలదు.

ఉదా:—"ఘృణీ కర్ణః ప్రమాదీచ తేన మేర్ధరథోమతః"

అర్థము:—కర్ణుఁడు, ఘృణీ దయాళువు, అయినను ప్రమాదీచ=ఏకాగ్రత లేనివాఁడు గూడను (అసావధాని) అందుచే నత డర్ధరథుఁడని నా యభిప్రాయము.

దయఁగలిగినవాఁడు, "నా బాణముచే నెవరికైన నన్యాయముగ నపాయము జరుగునేమో" యని, జాగరూకతను వహించును. కాని కర్ణున కా జాగరూకత లేదని భావము. ఘృణిత్వము, ప్రమాదిత్వము నొకవ్యక్తియం దుండవు. అవి పరస్పర విరుద్ధములు. కర్ణునియం దా రెండును నున్నవి. ఇచట 'చ'కారము విరోధమును తెల్పును. అపి శబ్దమునకు బదు లిచట చకారమున్నదని భావము.

ధ్వనికర్త, పై వాక్యములను బురస్కరించుకొని, యిట్లనినాఁడు.
"నవాచ్యో విరోధః, సాక్షాచ్ఛబ్దేన విరోధాలంకారస్య అప్రకాశితత్వాత్"

ఇచట, అపి శబ్దముచే, సాక్షాత్తుగ విరోధాలంకారము ప్రకాశితముగాకుంటచే, విరోధము చెప్పఁగూడదు. పై విచారమువలన ధ్వనికర్తవాక్య మసిద్ధమని తెలియవలెను.

"ఖమ్ యేఽభ్యుజ్జ్వలయన్తి శ్యానతమసో
యేవా నఖోద్భాసినః
యే పుష్ణన్తి సరోరుహ శ్రియమ్
అధిక్షిప్తాబ్జ భాసశ్చయే

యే మూర్ధస్వవభాసినః క్షితిభృతాం
యే చామరాణాం శిరాం
స్యాక్రామన్త్య భయేపి, తే, దినపతేః పాదాః
శ్రియై, సన్తు, వః"

అర్థము:—చీకటిని బోఁగొట్టి 'ఏవి' ఆకాశమును ప్రకాశింపఁ జేయునో, యేవి, నఖములచే నుద్భాసించునో, (న, ఖోద్భాసినః = ఆకాశమును ప్రకాశింపఁ జేయునో) ఏవి సరోహ(శ్రీ)ని పోషించునో, ఏవి యబ్జ కాంతులను తిరస్కరించునో, ఏవి పర్వతముల శిఖరముల యందు భాసించునో, ఏవి యమరులశిరసుల నాక్రమించునో, ఆ రెండు విధము లైన, సూర్యుని యొక్క పాదములును (1. కిరణములు 2. పాదములు శరీరావయవములు) మీకు సంపద కగుఁగాక.

ఇచట, ప్రతి పద్యపాదమునను మొదటిసగము కిరణపరముగను, రెండవసగము పాదముల పరముగను అన్వయించును. రెండర్థములును పరస్పరవిరుద్ధములుగ నున్నవి. భిన్న మైన యావిశేషణముల వలననే యుభయ పదములకును వ్యతిరేక మనుమేయ మగుచున్నది. అభిన్నవిశేషణము లున్నపుడు, నిబంధనమున్నచో సాదృశ్యమాత్రమే ప్రతీతమగును. వ్యతిరేకము గోచరింపదు. ఉదా॥

"భక్తిప్రహ్వ విలోకన ప్రణయినీ,
నీలోత్పల స్పర్ధినీ
ధ్యానాలంబనతామ్, సమాధి నిరతై
ర్నీతే, హితప్రాప్తయే
లావణ్యస్య, మహానిధీ, రసికతాం
లక్ష్మీం, దృశో, స్తన్వతీ
యుష్మాకం, కురుతాం, భవార్తి శమనమ్
నేత్రే, తనుర్వా, హరేః"

ఇందు విశేషణము లన్నియు, నేత్రములతో నన్వయించునపుడు ద్వివచనమునను, తను శబ్దముతో నన్వయించునపు డేక వచనమునను నుండును. వా శబ్దము సముచ్చయార్థక మని వ్యాఖ్యాతలు.

అర్థము:—భక్తి-ప్రణయినీ=(1)భక్తితో ప్రహ్వులైన వారిని చూచుటయందు ప్రణయముగలవి(నేత్రములు) (2)భక్తితో ప్రహ్వులైన వారియొక్క చూపులయొక్క ప్రేమ (ప్రణయము)గలిగినది-(తనువు); నీలోత్పలస్పర్ధినీ=నల్లకలువలతో స్పర్ధనందునవి (2) స్పర్ధనందునది; సమాధి నిరతులచే, హితప్రాప్తి కొఱకు, ధ్యానాలంబనతాం నీతే=ధ్యానవిషయముగాఁ జేయఁబడినవి- (2) ఈహిత ప్రాప్తయే=కోర్కుల నందుటకొఱకు, ధ్యానాలంబనతాం నీతా=ధ్యానాలంబనము చేయఁబడినది; లావణ్యమునకు మహానిధులు (2) మహానిధిః=మహానిధి; దృశౌ=నేత్రములకు, రసికతను లక్ష్మిని, తన్వాతే=చేయునవి (నపుం. ద్వివ) చేయునది (స్త్రీ. ఏ. వ)

వారియొక్క, నేత్రములు, తనువును, మీకు భవార్తి శమనమును చేయుఁగాక.

ఇచ్చట రెండర్థములలోను, చాలవఱకు, విశేషణము లభిన్నములుగనే యున్నవి.

విశేషణములు పరస్పరభిన్నము లగుచో, నన్యోన్య విశేషప్రతిపత్తికలుగును. భేదము లేనిదే, విశేషముకలుగదుగదా! అదియే వ్యతిరేకము. వేఱొకటికాదు. అందుచే నావ్యతిరేకము భిన్నవిశేషణత్వానుమేయమేగాని, శబ్దశక్తిమూలము గాదు.

పరకీయవచనము గూడ, నొకప్పుడు శ్లేషాభివ్యక్తి నిబంధనము కావచ్చును. వేణీసంహారము నందలి యుదాహరణము.

"రక్తప్రసాధితభువః, క్షతవిగ్రహాశ్చ,
స్వస్థా, భవన్తు, కురురాజసుతాః, సభృత్యాః

అర్థము:— రక్తప్రసాధితభువః=(1) రక్తముచే నలంకృతమైన భూమి గలవారు, (2) అనురాగముచే వశీకృతమైన భూమి గలవారు; క్షతవిగ్రహాశ్చ—నశించిన శరీరము గలవారు, (2) పోయిన యుద్ధము గలవారు; సభృత్యులైన కురురాజసుతులు, నేను (భీముఁడు) జీవించి యుండఁగా, స్వస్థాః=స్వర్గస్థులు (2) సుఖము గలవారు, భవన్తు=అగుదురు గాక-

శ్లేషవచనమును (ఇందలి రెండవయర్థమును మాత్రము తెలిసికొనిన) విన్న భీమసేను నోదార్చుటకై సహదేవుఁడు పల్కిన "ఆర్య! శుభరతపుత్రవచనము మన కనుమతమే" యనువచనము లిచటి శ్లేషకు నిబంధనము.

ఒకప్పుడు ప్రతీయమానార్థము శ్లేషాభివ్యక్తికి హేతువగును.
ఉదా :

ఆలింగనాదర, చిత, స్థితి, రాబభౌ, యా
పత్యుర్వికాసి పరిఖాజల నీవిబంధా
విస్తారి సాలజఘనమ్ పరివర్తమాన
నక్షత్ర రత్నరశనా గుణ ముద్వహన్తీ.

అర్థము:— యా=ఏనగరి, పత్యుః=రాజుయొక్క- ఆలింగన, ఆదర, చిత, స్థితిః=ఆలింగన మనెడు ఆదరముతోఁ గూడి, నిరంతర సంబంధము గల్గినదై-యని భావము) వికాసి పరిఖాజల నీవిబద్ధా=విస్తృతమైన యగడ్తలోని జలమే నీవిబంధముగాఁ గలిగినదై, విస్తారి సాలజఘనమ్=పెద్ద ప్రాకారమనెడు కటిప్రదేశమును, పరివర్తమాన ......... గుణమ్=తిరుగుచున్న నక్షత్రము లనెడు రత్నములు గల యొడ్డాణమును, ఉద్వహన్తీ=వహించుచున్నదై, ఆబభౌ=ప్రకాశించెనో.

ఇచట నొక నగరి వర్ణితమైనది. ఇందలి విశేషణ సామర్థ్యము

వలన నొకనాయికకు సంబంధించిన యర్థముగూడ ప్రతీతమగుచున్నది. ఈ నాయికార్థమే యిచట శ్లేషకు మూలము,

[నాయికార్థమునందు, పత్యుః శబ్దమునకు, భర్తయొక్క యని, యర్థముఁ జెప్పవలయును. ఇటులే, ఆలింగనార్థ మాదరయుత మగు స్థితిగలది, పరిఖా జలమువంటి నీవిబంధము గలది, సాలమువంటి జఘనము గలది, నక్షత్రములవంటి రత్నములుగల, యనునర్థములనుగూడఁ జెప్పుకొనవలయును.]

ఎచట నావృత్తి నిబంధనగన్థముగూడ నుండదో యచట నర్థాన్తరావగతి కవకాశ ముండదు. అట్టి తావులందు, కవులు, ఉభయార్థ పదోపనిబంధము సేయుట వ్యర్థమే. అచట వాచ్యావచన దోషము కల్గును. అందుచే వారిప్రయాసము నిష్ఫలమగును. అందుకు శబ్దశ్లేష విషయమైన యుదాహరణము.

"అస్మా భర్తురస్య వికటః కటకః సపీలు
పాలీకులస్సహారి సైన్యశతావమర్దః,
లక్ష్మీం విలాసఘటనాం నయతి వ్యపాస్త
నానాధి కామచర మాగధరాజితశ్రీః

అర్థము:—అస్య, అస్మాభర్తుః = ఈపర్వతముయొక్క, (రాజు యొక్క) వికటః = భయంకరమగునట్టియు, (గొప్పదైనట్టియు) సపీలు పాలీకులః = పీలువృక్ష పంక్తులతోఁగూడినట్టియు, (ఏనుఁగుల పంక్తులతోఁ గూడిన పీలు = వృక్ష భేదము, ఏనుఁగు) సహారిసైన్య శతావమర్దః = సింహసమూహశతముల తొక్కిడితో నున్నట్టియు, (అశ్వములతోనున్న సైన్యశతముల యవమర్దముతోఁ గూడినట్టియు) అచరమ, అగ, ధరాజితశ్రీః = హిమాలయపర్వతభూమిచే జయింపఁబడని శోభకలట్టియు, కటకః = చఱియు, వ్యపాస్త నానాధికామ్ = తొలగింపఁబడిన యనేకమనోవ్యాధులుకల, విలాసఘటనాం = విలాసఘటనమును

లేదా విలాస ఘటనముగల, (విలాసమును కలుగఁజేయునట్టి- యని భావము) లక్ష్మీమ్=శోభను, నయతి=కలిగియున్నది. ఇచట రాజపక్షమున నిట్లు తెలియవలయును. వ్యాప్త .... శ్రీః=తొలగింపఁబడిన మనోవ్యాధులు కలిగి, స్వేచ్ఛగా సంచరించు, మగధదేశపు భటులచే నొప్పియున్న శోభకల కటకః=సేనా సన్నివేశము, విలాస ఘటనమును, లక్ష్మిని, కూర్చుచున్నది.

ఇచట శ్లేషను జెప్పుటకుఁదగిన హేతువేమియును లేదని గ్రంథకర్త్రభిప్రాయము.

ఉదాహరణాన్తరము.

"యేనధ్వస్త మనోభవేన బలిజత్కాయః పురాస్త్రీకృతః
యశ్చోద్వృత్త భుజంగహారవలయో గంగాంచ యోఽధారయత్
యస్యాహుఃశశిమచ్ఛిరోహర ఇతి స్తుత్యంచ నామామరాః
పాయాత్ సస్వయ మంధక క్షయకరస్త్వాం సర్వదోమాధవః"

అర్థము:— ఈ పద్యము విష్ణుపరముగను, శివపరముగనుగూడ నన్వయించును.

అభవేన=పుట్టుకలేని, యేన=ఎవనిచేత, అనః=శకటము, (శకటాసురుఁడు) ధ్వస్తమ్=నాశనము చేయఁబడినదో, బలిజిత్ కాయః=వామనావతారమునకు సంబంధించిన దేహము, లేదా బలవంతులైన రాక్షసులను జయించుశరీరము, పురా=పూర్వము, అమృతమును పంచిపెట్టు సమయమున, స్త్రీకృతః=స్త్రీగాఁ జేయఁబడినదో, (మోహినీరూపమున) యశ్చ=ఎవఁడు, ఉద్వృత్తభుజంగహా=మదించిన కాళీయుఁడను పామునుచంపినాఁడో, రవ,లయః=శబ్దమునందులయము గలవాఁడో, అగం, గాంచ, యః అధారయత్=గోవర్ధన పర్వతమును, భూమిని, ధరించినాఁడో, (వరాహావతారమున భూమిని ధరించినాఁడు) శశిమచ్ఛిరోహరః ఇతి=శశిమచ్ఛిరోహరుఁడు రాహు శిరమును ఖండిం

చినవాఁడు)అను యస్యనామ=ఎవనినామమును, అమరాః=దేవతలు స్తుత్యం=స్తుతింపఁదగిన దానినిగా, ఆహుః=చెప్పుదురో, సః=ఆ, అన్ధకక్షయకరః=అన్ధకులనువారికి నివాసము నేర్పఱచిన, సర్వదః=అన్నిటి నిచ్చు, మాధవః=విష్ణువు, న త్వాం పాయాత్=నిన్ను రక్షించుఁ గాక.

(2) ధ్వస్త మనోభవేన, యేన=మన్మథుని నాశనము చేసిన యెవని చేత, బలిజిత్ కాయః=విష్ణుశరీరము, పురా=పూర్వకాలము, త్రిపుర సంహార సమయమున, అస్త్రీకృతః=అస్త్రముగాఁ జేయఁబడినదో, ఉద్వృత్తభుజంగహార వలయః=చుట్టుకొనిన భుజంగములే హారములు గను, వలయములుగను గలవాఁడో, గంగాం యఃఅధారయత్ =ఎవఁడు గంగను ధరించినాఁడో, యస్యశిరః శశిమత్ =ఎవని శిరస్సు చంద్రుని గల్గినది, హర ఇతి నామ స్తుత్యమ్=హరుఁడను పేరు స్తుతింపఁదగినది, అని దేవతలు చెప్పుదురో, అన్ధకాసురుని సంహరించిన, సః ఉమాధవః=ఆ యీశ్వరుఁడు, నిన్ను సర్వదా=ఎల్లప్పుడు, రక్షించుఁ గాక.

ఇటులే-

"కథం,నామ, న.భవసి, త్వం, భాజన మసమంజసస్య నరనాథ
నిత్యమేవ, కుర్వన్, యథేచ్ఛ మర్థానామ్, వినియోగమ్"

అర్థము:— ఓ రాజా ! నిత్యమును యథేచ్ఛముగ ధనమును వినియోగముసేయు నీవు, అసామంజస్యమునకు (కలవరమునకు) పాత్రుఁడ వేలగావు ? ఇటువంటి వానియందును వాచ్యావచన దోష మున్నదని తెలియువలయును- ఈ తుదిశ్లోకమున నున్నది నిందయా? లేక స్తుతియా ? యని నిశ్చయించుటకు ఆధార మేదియును లేదు. అందుచే నిట దోషము కల్గినది.

అర్థశ్లేషవిషయమున నుదాహృతి :

"దత్తానందాఃప్రజానాం సముచితసమయాక్లిష్టసృష్టైఃపయోభిః

పూర్వాహ్ణే విప్రకీర్ణా దిశిదిశి విరమ త్యహ్ని సంహారభాజః
దీర్ఘాంశో ర్దీర్ఘదుఃఖప్రభవ భవభయోదన్వదు త్తారనావః
గావో వః పావనానాం పరమపరిమితాం ప్రీతిము త్పాదయన్తు'

అర్థము:—సముచిత......సృష్టైః = తగిన సమయమునందు కష్టము లేకయే సృష్టించిన, పయోభిః=జలములచేత (పాలచే) ప్రజానామ్ దత్తానందాః=ప్రజలకు (దూడలకు) ఆనందము నిచ్చినట్టియు, పూర్వాహ్ణసమయమునందు దిశిదిశి=అన్ని దిక్కులయందును, విప్రకీర్ణాః=వ్యాపించినట్టియు (అన్ని వైపులకు వెళ్లినట్టియు) అహ్ని, విరమతి, సంహార భాజః=సాయంసమయమున సంకోచము నొందునట్టియు (ఇంటికి తిరిగి వచ్చునట్టియు) దీర్ఘ...నావః=చిర కాల దుఃఖమునకు హేతువగు సంసారభయమనెడు సముద్రమును తరించుటకు నావ లైనట్టియు, దీప్తాంశోః=సూర్యునియొక్క, గావః=కిరణములు (ఆవులు) పవిత్రులైన మీకు అపరిమితమైన ప్రీతిని కలుగఁజేయుఁగాక.

ఇచట "గావః" (కిరణములు) అనునది విశేష్యవాచకము. ఉపమేయము- దీనికి ఉపమానము "ధేనువులు". గావః అను శబ్దమే ధేనువులను నర్థమునుఁగూడఁ జెప్పును. ఇందలి విశేషణములుగూడ, కిరణములకును, ధేనువులకును రెంటికిని అన్వయించును. అయినను, ఉపమానమునుగాని, తత్సంబంధమును దెల్పు "ఇవ" (వలె) మొదలగు పదములనుగాని, అవశ్యము చెప్పవలసిన వానిని జెప్పకుండుట, దోష మను విషయము ముందు విస్తరింపఁబడును.

ఉభయశ్లేష కుదాహృతి :

"సర్వైక శరణ మక్షయ మధీశ మీశం ధియాం హరిం కృష్ణమ్
చతురాత్మానమ్, నిష్క్రియ మరిమథనమ్ నమతచక్రధరమ్''

అర్థము:—సర్వైకశరణమ్=అందఱకు ఒకేగృహమైనవాఁడు, అక్షయం=గృహముకానివాఁడు (అందఱకు ఒకే రక్షకుఁడు,నాశనము

లేనివాఁడు-అని పూర్వపు టర్థము నందలి విరోధమునకు పరిహారము) అ+ధీశమ్=బుద్ధుల కీశ్వరుఁడు గానివాఁడు, ధియామ్ ఈశమ్=బుద్ధుల కీశ్వరుఁడు, (ప్రభువు, బుద్ధుల కీశ్వరుఁడు-అని పరిహారము)

హరిమ్=కపిలవర్ణము గలవాఁడు, కృష్ణమ్=నల్లనివాఁడు,(పాపమును హరించువాఁడు, కృష్ణుఁడను నామముగలవాఁడు-అని విరోధ పరిహారము) చతురాత్మానమ్=పరాక్రమవంతుఁడు, నిష్క్రియమ్=క్రియారహితుఁడు (సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్నానిరుద్ధరూపములగు నాలుగు వ్యూహముల రూపముగలవాఁడు-సహజముగ నిష్క్రియుఁడు-అని పరిహారము) అరిమథనమ్=చక్రములను నాశనముసేయువాఁడు, చక్రధరుఁడు (శత్రునాశకుఁడు, చక్రధరుఁడు నని విరోధ పరిహారము) అగు విష్ణువునుగుఱించి నమస్కరింపుము. (ఈపద్యమునందుఁ గూడ, పై పద్యమునందువలెనే, శ్లేషకు నిబంధనములేదని భావము. ఉపమానవాచకపదము ప్రత్యేకముగ నున్నచో శ్లేష కవకాశముండదని యభిప్రాయము.

ఈ క్రిందిపద్యమునందుఁ గూడ వాచ్యావచనదోష మున్నదని తెలియవలయును.

"పతితే పతంగమృగరాజి నిజప్రతిబింబ రోషత ఇవాంబునిధౌ
అథ నాగ యూథమలినాని జగత్పతి స్తమాంసి పరిత స్తరి రే''

అర్థము:—సూర్యుఁడనెడు సింహము, తన ప్రతిబింబమునందలి రోషమువలన వలె, సముద్రమునందు పడఁగా, నాగయూథముల వలె మలినములైన తమస్సులు, జగత్తంతటను వ్యాపించినవి.

ఇచట నాగయూథములకును, చీకట్లకును సాదృశ్యమునుజెప్పుటయే కవి కభిమతము. నాగయూథధర్మమగు మలినత్వమాత్రముతో సామ్యమును జెప్పుట కవి కభిమతము గాదు. సింహము పోయిన తరువాత, శత్రువు లేకుంటచే, స్వేచ్ఛగా విహరించునవి ఏనుఁగులే గాని,

ఏనుఁగులగుంపువలె మలినముగనుండు చీకట్లుగాదు. అట్లు విహరించునవి ఏనుఁగులేయగుచో సూర్యుని మృగరాజుగానిరూపించుట వ్యర్థమగును. సామ్యమును, హారి, సుందర సుభగ, సదృశ సన్నిభాది శబ్దములు తెల్పునుగాని, మలినాది శబ్దములు తెలుపలేవుగదా! అట్లు కానిచో,

"సరోజ కర్ణికా గౌరీం గౌరీం ప్రతి మనో దధౌ"

(పద్మముయొక్క కర్ణికవలె తెల్లగనున్న గౌరిని ధ్యానించెను) మొదలగు వాక్యములయందు గౌరాది శబ్దములు గూడ ధర్మమాత్రి సామ్యమునే గాక, ధర్మి సామ్యమునే తెలియఁజేసెడివి. (ధర్మి= గౌరీదేవి) గౌరికిని సరోజకర్ణికకును సామ్యము గౌరత్వమాత్రి సాధర్మ్యకృత మనియే కవివివక్షితమగుటచే గౌరాది శబ్దములు ధర్మి సామ్యమును తెలుపుట యనిష్టము.

ప్రశ్న:—గౌరాది శబ్దములుగూడ సదృశాది శబ్దములవలె సాక్షాత్తుగ ధర్మిసామ్యమునే తెలుపును. కర్ణికకు గౌరత్వ మవ్యభిచరిత మగుటచే, సామర్థ్యమువలన ధర్మమాత్రి సామ్యావగతి కలుగునని యేల యనఁగూడదు?

సమాధానము:—ఉన్న వాక్యమునందు, గౌరత్వ ధర్మము నాధారముగఁగొని, ఉపమానోపమేయములకు సామ్యమభిహితమైనది. ఇపుడు, మీరుసూచించునట్లు గ్రహింతుమేని, శ్రుతహానియు, అశ్రుత కల్పనయుఁ జేయవలసి వచ్చును. అది అన్యాయము. అందుచే మీ వాదము యుక్తముకాదు. అట్టిప్రతీతి కలుగుచున్నచో, మీవాదము నంగీకరించుట కవకాశ ముండెడిది. కాని అట్టి ప్రతీతి కలుగుటలేదు.

రెండు ధర్మములలో నొకధర్మము నిర్దేశించినచో సాహచర్యవశమున ద్వితీయధర్మప్రతిపత్తి కలుగునని కొందఱు భావించుచున్నారు. ఇందుల కుదాహరణము—

"నిష్పిష్టే.పి, బహిర్ఘనే, న, విరమ త్యంత ర్జరద్వేశ్మనామ్

లూతాతంతుత తిచ్ఛిదో, మధుసృమత్పింగాః, పయోబిందవః”

అర్థము:— మేఘములు కురిసి వెలసినను, జీర్ణ గృహముల లోపల, సాలిపురుగు దారముల సమూహమును నాశనము చేయునట్టియు మధుబిందువులవలె కపిలవర్ణము గలట్టియు, నీటి బిందువులు పడుచునే యున్నవి.

ఇచట నీటిబిందువులకు, మధుబిందువులకున్న కపిలవర్ణ మున్నట్లె పింగత్వసహచరితమగు వృత్తత్వము (గుండ్రముగ నుండుటయు) గూడ ప్రతీతమగును అని వారందురు.

అది యుక్తముకాదు. అగుచో, సాహచర్యము సమానమేయగుటచే, పయోబిందువులలో మాధుర్యము గూడ ప్రతీతము కావలసి వచ్చును. హేతువగు ధర్మముయొక్క అనుమానముచేతనే యందున్న రూపాది ప్రతీతి కలుగును.

ప్రస్తుతోదాహరణముగ పింగత్వ మాధుర్యములకు సాహచర్యముసిద్ధముకాదు. సాహచర్యమే లేనపుడు అన్యధర్మ ప్రతీతి యెట్లు కలుగును? ఒకవేళ సాహచర్యము సిద్ధించినను, మధుబిందువునందున్న యొక ధర్మమునకు సాధనభావనిర్దేశము లేనిదే రెండవధర్మము ప్రతీతమగుట యెట్లు ?- అట్టి నిర్దేశము లేకున్నను రెండవ ధర్మము ప్రతీతమగునేని,

“దుఃఖాభితప్తస్య । జనస్య। జానే
తుషార। శీతః। ప్రతిభాతి। వహ్నిః

అర్థము:— దుఃఖాభితప్తుఁడగుజనునకు, అగ్ని, మంచువలె చల్లనగును- అనువాక్యమునందు అగ్నియందు శీతత్వ సాహచర్యము వలన పాండుత్వముగూడ, ప్రతీతముకావలసి వచ్చును.

ఇంకొక విషయమునుగూడ గుర్తింపవలయును. అన్యధర్మప్రతిపత్తి సిద్ధియున్నచో, ఆ ప్రతిపత్తికి హేతువు, సాహచర్యమో, మఱి

యేదియో యొకదానిని కల్పింపవచ్చును. ప్రస్తుత మస్యధర్మ ప్రతిపత్తియే లేదు. అందుచే, హేతుపరికల్పన ప్రయాసమే, యచట వ్యర్థము.

హేతుపరికల్పనము లేకున్నను నిచట నేమి లోటు కల్గును? పయోబిందువులలో వృత్తత్వము భాసింపదని సమాధాన మీయవచ్చును. వృత్తత్వము భాసింపకుండుఁ గాక. అంతమాత్రమున హాని యేమి? ప్రయోజనము ననుసరించి ప్రమాణవ్యవస్థ యుండదుగదా!

అందుచే నొకవస్తువునం దనేకధర్మము లున్నను ఏ ధర్మము యొక్క నిర్దేశముండునో, ఆధర్మముయొక్క ప్రతిపత్తియే న్యాయము. మఱియొక ధర్మముయొక్క ప్రతీతి న్యాయము కాదు. అందువలన నిచట, తమస్సులకు నాగయూథ సాదృశ్యము, వాచ్యము, గావలసియుండ, వాని మలినత్వమును చెప్పుట, వాచ్యావచన దోషమునకు దారిని తీసినది.

కాఁగా, ఇచట "పృషత్" పద మధికముగనున్నది. అది కేవల మనుప్రాసము కొఱకును, వృత్తపరిపూరణ కొఱకు మాత్రమే యుపయోగించును. బిందువులలో వృత్తత్వ ప్రతీతి కొఱ కుపకరింపదు.

పై పద్యమున "నాగయూథ సదృశాని" అని పాఠ ముండుట మంచిది.

"కరి కరభ! విముంచ లోలతామ్ చరవినయవ్రతమానతాననః
మృగపతి నఖకోటి భంగురో గురు రుపరి క్షమతే న తేంకుశః"

అర్థము:—ఓ కరికరభమా! (ఏనుఁగుపిల్ల) లోలతనువదలుము. ఆనతాననుఁడవై వినయవ్రతము నాచరింపుము. సింహ నఖాగ్రభాగమువలె వంకరగ నుండు, పెద్ద (దుస్సహమైన) అంకుశము నిన్ను క్షమింపదు.

ఇచట నంకుశమునకు, మృగపతి నఖకోటి భంగురత్వము,

దుస్సహత్వము, లను ధర్మద్వయము వివక్షితము- భంగురశబ్దమునకు కౌటిల్య మను నర్థము మాత్రిమే ప్రసిద్ధము. అందుచే నది పైని సూచితమైన రీతిని, ధర్మ ద్వయమును తెలుపలేదు. మృగపతి పద సంబంధ సామర్థ్యమువలననే దుస్సహత్వము ప్రతీత మగును. భంగు రత్వ సాహచర్యమువలన మాత్రము కాదు.

ఇటులే,

"ప్రభవతి చ సమరమూర్ధని, నవనీరద నీల, ఏష, తవ, ఖడ్గః విశతి,చ,మానస మమలం, సతాం,యశో, హంసవిసరసితమ్"

అర్థము:—నవనీరదమువలె నల్లనైన నీ యీ ఖడ్గము, సమర శిరసున (యుద్ధరంగాగ్రమున) విజృంభించును. హంసల పిండువలె తెల్లనైన కీర్తి సత్పురుషుల మనస్సును ప్రవేశించును. (లేదా సత్పు రుషుల కీర్తి, మనసునందు ప్రవేశించును.)

ఇచట, 'పతితే పతంగ మృగ రాజి' అనుపద్యమునందు వలెనే, ఖడ్గమునకు నవనీరదరూపము గాని, యశస్సునకు హంసవిసరరూపము గాని ప్రతీత మగుట లేదు- ఆ ప్రతీతి లేనపుడు తన్మూలమైన యర్థా న్తరప్రతీతి యుండదు. అందుచే నిచట 'సమరమూర్ధని' అను పద మునకు- "మరేణ మృత్యునా సహితః" మృత్యు సహితుడైనవాని శిరసున- అనిగాని, మానస పదమునకు, మానస సరోవరమనునర్థము గాని ప్రతీత మగుచున్నదనుట భ్రాన్తిమాత్రకృతమే యని భావింప నలయును. అందుచే నిట "నవనీరద సుందరః కృపాణః"అని, "హంస విసరసమమ్" అని సవరించుట లెస్స.

"ధర్మిసామ్యము మాత్రమే వివక్షిత మైనపుడు, ధర్మమాత్ర మును దెల్పు శబ్దములను ఉపమితి సమాసమున ప్రయోగించుటను బుధు లంగీకరింపరు." (93-సంగ్రహశ్లోకార్థము)

ఉదా॥ "తేనావరోధప్రమదాసఖేన, విగాహమానేన, సరిద్వరాం, తామ్
ఆకాశగంగా రతిరప్సరోభిః, వృతో, మరుత్వాననుయాత లీలః."

అర్థము:—సరిద్వరమైన యా గంగను ప్రవేశించుచున్నట్టియు (అందుస్నానముచేయు) అంతఃపురప్రమదాసఖుఁడైనట్టియు, నారాజుచే ఆకాశగంగారతుఁ డైనట్టియు, అప్సరఃపరివృతుఁ డైనట్టియు, నింద్రుఁ డనుయాత లీలుఁడయ్యెను. (అనుకరింపఁబడిన లీలలుకలవాఁడయ్యెను)

ఇచట "అనుయాతి" (అనుసరించెను) అను క్రియ నాధారముగఁ జేసికొని, రాజునకు, కర్తృత్వమును, మరుత్వంతునకు కర్మత్వమును జెప్పుట కవి కభిమతము. కాని రాజున కింద్రునితోఁగల సంబంధము, జలలీలాముఖమున (అనుయాతలీలః-అనుటవలన) నుక్తమైనది గాని, సాక్షాత్తుగ నుక్తముకాలేదు. ఇచట రాజునకును నింద్రునకును కర్తృకర్మభావము ఘటింపవలయునన్న నా సంబంధమును సాక్షాత్తుగ నైనఁ జెప్పవలయును. లేదా యా సంబంధము భాసించుటకై, వేఱొక క్రియనైన నుపయోగింపవలయును. ఈ రెంటిలో నే యొక్కటియు లేకుంటచే నిట నవాచ్యవచనము దోషము. ఆ దోషము పరిహృతముకావలయునన్నచో

"ఆకాశగంగా రతిరప్సరోభి ర్వృతోఽనుయాతో మఘవా విలాసైః"

(ఆకాశగంగా రతుఁడును,నప్సరోవృతుఁడును నైన,యింద్రుఁడు విలాసములచే ననుకరింపఁబడెను.) అని యుండవలయును.

ఇపుడు క్రియాన్తరాపేక్షాప్రసంగ ముండదు.

ఉదాహరణాన్తరము :

"లక్ష్మీ దుహితా, జామాతా, హరిః, తథా, గృహిణీ గంగా
అమృత మృగాంకౌ, చ, సుతౌ, అహో! కుటుంబం మహోదధేః

అర్థము:—లక్ష్మి కూఁతురు, అల్లుఁడు హరి, భార్య గంగ, అమృతము చంద్రుఁడు సుతులు, ఆహా సముద్రుని కుటుంబము! (ఎంత ధన్యము)

ఇచట లక్ష్మికి దుహితృత్వము, అమృత మృగాంకులకు సుత త్వము, విధీయమానమైనది. వీనిచేతనే మహోదధికుటుంబముయొక్క-శ్లాఘాస్పదత్వము ప్రతీత మగును. అందువలన నిచట నా రెండే, యుపాదేయములు- మిగిలినవి యుపాదేయములుగావు-భగవంతుఁడైన హరి, గంయును సకల త్రైలోక్యాలంకారము లనుమాట సత్యమే యైనను, వారికి జామాతృత్వము గాని, గృహిణీత్వముగాని, యిట విహితము కాలేదు. అందుచే మహోదధికి శ్లాఘాతిశయ యోగము పొసఁగదు. అదిలేనపుడు తన్నిబంధనమైన యత్యద్భుతాస్పదత్వమును గలుగదు. అవశ్యము వాచ్యమైన జామాతృత్వగృహిణీత్వవిధాన ముక్తము కాకుంటచే, నిట నవాచ్యవచనము దోషము.

ఆక్షేపణము:—పై శ్లోకమునందలి పదములలోని క్రమమును "హరిః, జామాతా, గంగా గృహిణీ" అనిమార్చి, అన్వయించినపుడు జామాతృ గృహిణీ పదములు, హరి గంగా శబ్దముల యనంతరమే భాసించుటచే, తదర్థములకు విధీయమానత్వము పొసగును. అపుడీ దోషమున కవకాశము లేదుగదా ?-అన్వయములోని యీ మార్పు పురుషాధీనమేగదా!

సమాధానము:—సత్యమే. కాని, యీ సంబంధము, సర్వవిషయములయందును పురుషాధీన మనుట యుక్తముకాదు. విశేషణ విశేష్యభావ విషయమునమాత్రమే యీసంబంధమును మన యిష్టము వచ్చినట్లు మార్చుకొనవచ్చును. ఎచట విశేష్య విశేషణములకు, స్వసౌందర్యము వలననే యన్యోన్యాపేక్ష మైన విధ్యనువాదభావ ముండునో యచట యథాశ్రుతమగు పదార్థసంబంధ నిబంధన మైన యర్థప్రతీతి క్రమము నాదరింపవలయును. అందుచే నచటనే పదార్థ పౌర్వాపర్య నియమ ముండునని తెలియవలయును.

ఉదా॥ "త్వక్ శారవీ నివసనం, మృగచర్మ, శయ్యా,
గేహం గుహా, విపులపత్రపుటా ఘటాశ్చ,

మూలం దలంచ కుసుమంచ ఫలంచ భోజ్యం
పుత్రస్య, జాతసేమటవీ గృహమేధినస్తే"

అర్థము:—అడవియందు నివసించు నీకుమారునకు, చెట్టుబెరడే వస్త్రము, మృగచర్మమే శయ్య, ఇల్లు గుహ. విపులపత్రపుటములు కుండలు, మూలములు, దలములు, కుసుమములు, ఫలములు, ఆహారము.

ఇచట- అటవీ గృహమేధి యైన నీ కుమారుఁడు అని, అటవీ ప్రసంగమునకు ప్రాధాన్య ముండుటవలన, నడవికి సంబంధించిన తరుత్వక్కు- నుద్దేశ్యముగ గ్రహించి,నివసనత్వమును విధేయముగ గ్రహించుటయే యుక్తము. ఇటులే మృగచర్మాదులయందును దెలియునది. అందుచే పదములనున్న క్రమము ననుసరించియే యన్వయించుట మంచిదిగాని క్రమమును మార్చుట సరిగాదు. అని గ్రంథకర్త్రభిప్రాయము. ఇట్లు చూచినను "గుహా గేహమ్" అని మార్పవలయును గదా !)

ప్రత్యుదాహరణము :

"శయ్యా శాద్వల, మాసనం శుచిశిలా, సద్మ ద్రుమాణామధః
శీతం నిర్ఝరవారిపాన, మశనం కన్దా, స్సహాయా మృగాః
ఇత్యప్రార్థితలభ్యసర్వవిభ వే, దోషోఽయ మేకో, వనే
దుష్ప్రాపార్థిని, యత్, పదార్థఘటనావక్థ్యా, ర్యాద్ధాస్థీయతే"

అర్థము:—(ఉన్న క్రమము ననుసరించి)- శయ్య పచ్చిగడ్డి, ఆసనము శుచియైన శిల, ఇల్లు చెట్లక్రింద, చల్లని నిర్ఝరనీరమే పానీయము, ఆహారము మూలములు, సహాయము మృగములు, ఈ విధముగ వనమునందు ప్రార్థింపఁబడకయే విభవములన్నియు లభించును. కాని,యాచకుఁడను వాఁడు లభింపఁడు.అందుచేఁబరోపకారము చేయుట

కవకాశము లేని యిచటనున్న వారు తమ జీవితమును వ్యర్థముగ గడుప వలయును. ఈ యుదాహరణ ప్రిత్యుదాహరణముల ప్రితీతిలోఁ గల భేదము మతిమన్తులకు భాసించుచునేయుండును. తదితరులకుమాత్రిము శపథప్రత్యేయమే

(ప్రిత్యుదాహరణమునందు- పదముల క్రిమనుమార్చి యన్వయించుటయే యుచితము. శీతం నిర్ఝరవారి- అనునపుడు మాత్రిము మార్పనక్కఱలేదు.)

అనువాద్యమును చెప్పకయే విధేయమును జెప్పఁగూడదు. అల బ్ధాస్పదమైన దేదియు నెచ్చటను ప్రితిష్ఠ నొందదు. (94)

ఈ విధెయోద్దేశ్య భావము రూప్యరూపక భావ సదృశము. అందు, ఉద్దేశ్యముకంటె ముందుగ విధేయము నుపయోగింపఁ జనదు. (95) అవాన్తర శ్లోకార్థము.

ఉదా॥ "స్పష్టో చ్ఛ్వసత్ కిరణకేసర సూర్యబింబ విస్తీర్ణ కర్ణిక మధో దివసారవిన్దమ్,

శ్లిష్టాష్టదిగ్దలకలాప ముఖావతార బద్ధాంధకారమధుపా వలి సంచుకోచ"

అర్థము:—స్పష్టముగ విస్తరించుచున్న కిరణము లనెడు కేసరములుగల సూర్యబింబముచే వికసించుకర్ణికగలట్టియు, శ్లిష్టమైన యెనిమిది దిక్కులనెడు దళములసమూహముయొక్క ముఖమునందు ప్రివేశించుటచే బద్ధమైన యంధకారముగల మధుపావళి గలట్టియు, దివసమనెడు అరవిందము ముడుచుకొనెను.

ఇచట, కేసరారవిన్ద కలాపములకు విధేయత్వము భాసించుచున్నది. ఆ పదము లుద్దేశ్యము తరువాతనే యున్నవి. పదముల యభి

సంబంధమును మార్చినంత మాత్రమున ననిష్ట ప్రతీతి యేరచనమునఁ గల్గునో యారచనమును ఒరిత్యజింపవలయును. (౨౦).

ఉదా॥ తవకంఠాసృజా సిక్తా కరవాలలతా ద్విషామ్
ప్రసూతే, సమరారణ్యే, యశఃకుసుమసంపదమ్"

అర్థము:—ద్విషామ్=శత్రువులయొక్క, కంఠాసృజాసిక్తా=కంఠపు నెత్తురుతోఁ దడిసిన, తవ=నీయొక్క, కరవాల లతా=ఖడ్గమనెడు లత, సమరమనెడు నరణ్యమున యశస్సనెడు కుసుమసంపదను కల్గించుచున్నది.

ఇచట, "ద్విషామ్"పదము మొదటనుండి "తవ" అనుపదము ప్రథమ పాదమునకు చివర నుండవలయును. ఉన్న క్రమమునే యనుసరించుచో, "నీ కంఠ రక్తముతోఁ దడిసిన, శత్రువుల ఖడ్గలత" యని విపరీతార్థమువ్చను. కావున "తవ" "ద్విషామ్" అనుపదములు వాని స్థానములనుమార్చుకొనవలయును లేదా "ద్విషత్కంఠాసృజాసిక్తాత్వత్కరవాల లతా" యని సమాసములనైనఁ జేయవలయును.

ఇందులో దేనినిఁ గూడఁ జేయకుండుట యనిష్టార్థ ప్రతీతికి మూలమై, దోషాయుతన మగుచున్నది.

ఉదా॥ "మధుశ్చతే మన్మథ సాహచర్యా దసా వనుక్తోపి
సహాయ ఏవ
సమీరణః ప్రేరయితా భవేతి వ్యాదిశ్యతే కేన
హుతాశనస్య"

అర్థము:—ఓ మన్మథా! మధువును (వసంతర్తువును) అనుక్తుఁడయ్యు, సాహచర్యవశమున నీకు సహాయుఁడగనే యుండును. "అగ్నిని రగుల్కొల్పుము" అని సమీరణు నెవ రాజ్ఞాపించుచున్నారు?

(ఇచట సమీరణ, హుతాశన శబ్దములు దూరముగ నుండుట యనన్వయ క్లేశము నాపాదించునని గ్రంథకర్త్రభిప్రాయము.)

అందువలననే

"యేన యస్యాభిసంబంధో దూరస్థేనాపి తేన సః
పదానా మసమాసానామ్ ఆనంతర్య మకారణమ్"

అర్థము:—ఏ పదమున కే పదముతో నన్వయమో యవి రెండును దూరముగనున్నను, నన్వయించును. సమాస రహితములైన పదము లొకదానితో నొకటి యన్వయింప వలయున్న నా రెంటికిని నానన్తర్య ముండవలయునను నియమము లేదు, అని పూర్వాచార్యులనినారు. అది యుక్తము కాదు. దూరముగ నున్న రెండు శబ్దముల ప్రతీతికిని, దగ్గరగనున్న రెండుశబ్దముల ప్రతీతికిని గలవైచిత్ర్యమును (భేదమును) గుర్తింపకుండుట వలననే వా రట్లనినారు. ఏ శబ్దములకు స్వరూపమున నవస్థితి యిష్టముగాదో (ఏ శబ్దములు పరస్పర మన్వయించునో) యా శబ్దములను,విచక్షణు లైనవా రవ్యవహితముగనే ప్రయోగింపవలయును. (97,98 సంగ్రహ శ్లోకముల యర్థము.)

అందుచే "ద్విషత్కంఠాసృజా సిక్తాత్త్వత్ కృపాణలతా వరా" అనియు, "వ్యాదిశ్యతే కేన సమీరణోవా హవిర్భుజశ్చోందయితాభవేతి" యనియు పాదములను సవరించుట మంచిది.

అనన్వయముగూడ నభ్యూహ్యమైన యర్థము గల్గియుంటచే రసభంగహేతువే యగును. అందుచే నదియు వాచ్యావచనదోషమే.

(సశేషము)

ఆంధ్రసాహిత్యపరిషత్తు

శాశ్వతాధ్యక్షులు

విమర్శకాగ్రేసర ఐతిహాసిక సమ్రాట్టు

శ్రీ బండారు తమ్మయ్య

ప్రధాన కార్యదర్శి. కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు

సహాయ కార్యదర్శి

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహకవర్గ సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ)
4. శ్రీ శాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రాశ్నికవిదండ్రి)
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ
7. డాక్టరు శ్రీ ఇనటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
8. శ్రీ చిరువోలు కోటేశ్వరరావు
9. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.
10. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, బి. ఏ. (ఆనర్సు)
11. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
12. శ్రీ కావలి శ్రీరామమూర్తి, బి. ఎ. బి ఎల్.

పత్రికా సంపాదకుడు

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి